





వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

ఆంధ్రప్రదేశ్ కు, తమిళనాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.




సీ తా న్వే ష ణ




జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# ఆదర్శ నాయకత్వము

జాతీయ కాంగ్రెస్ నాయకత్వమునకు మూలస్తంభములాంటివాడు శ్రీ గోవింద వల్లభ్‌పంత్. స్వాతంత్ర్య సమరములోనేమి, జాతీయాభ్యుదయ కార్యక్రమాల నిర్వహణలోనేమి, నిర్మాణకార్యక్రమ నిర్వహణలోనేమి, పరిపాలనా దక్షతలోనేమి వీరుడుగా ధీరుడుగా అత్యంత సమర్ధుడుగా పేర్కొన తగినవాడు. గాంధీజీనాయకత్వమున అచంచలమైన విశ్వాసంతో, ప్రజలయొక్క, దేశంయొక్క శ్రేయస్సును, సౌభాగ్యము నుద్దేశించి వీరోచితంగా పోరాడి చిత్తశుద్ధిని ప్రదర్శించిన త్యాగపురుషుడు. ఆయన నిండుమనిషి. విశాల హృదయంకలవాడు. ధైర్యసాహసాలలో సర్దార్ వల్లభాయ్ పటేల్ తర్వాత పేర్కొనతగినవాడు యీయనయే. శ్రీ పంత్ మరణం జాతీయ నాయకత్వానికి, దేశానికికూడ తీరనిలోటు కలిగించింది.

భారత దేశీయాంగ మంత్రిగాను, కాంగ్రెస్ అగ్రనాయకులలో నొకరుగాను

అనేక జాతీయ క్లిష్టసమస్యల పరిష్కారానికి శ్రీ గోవిందవల్లభ్‌పంత్ సమయస్ఫూర్తి, దక్షత, అపార అనుభవసామర్థ్యాలు ప్రధాని నెహ్రూకు తోడ్పడుతుండేవి. కేంద్ర మంత్రివర్గంలో ఆయనలేనిలోటు తీరడం సులభసాధ్యంకానేరదు.

శ్రీ గోవిందవల్లభ్‌పంత్ ఆదర్శనీయుడైన జాతీయవీరుడు, నాయకుడుకూడాను. శిసలైన నిర్మాణకార్యకర్త, ప్రజాసేవకుడు. ఈ నాడు రాజకీయరంగంలోని అనేకులు ఆయన జీవిత చరిత్రను ఆదర్శంగా తీసికొని, ఉత్తమ ఆదర్శలక్ష్యాల సిద్ధికి, దేశం యొక్క ప్రజలయొక్క కళ్యాణమునకు పాటుపడవలసియున్నది.

శ్రీ పంత్ నిర్యాణముపట్ల మా సంతాపమును వెల్లడించుచు ఆయనవ్యక్తిత్వము, ఉత్తమగుణాలు జాతీయరంగంలో ప్రజలకు మార్గదర్శకం కావాలని ఆశిస్తున్నాము.

---

# ఆర్థికస్థితిగతులు — ప్రజలు



దేశం యొక్క స్థితిగతులనుగురించి మాట్లాడాలంటే ప్రజలనిత్యజీవితాన్ని, జీవన వ్యయాన్ని, ఆదాయాన్ని పారచూడాలి. ప్రజల ఆదాయానికి, అనుదినం పెరుగుతున్న నిత్యావసరాల ధరవరలకు ఎలాటి సంబంధములేకుండా ఏక్షణానికాక్షణం నిరాశ, నిస్పృహలు ఆవరిస్తున్నవి.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు అనేక ఘనవిజయాలు సాధించియుండవచ్చు. అనేకరంగాలలో ఉత్పత్తులు పెరిగియుండవచ్చును. అనేకలక్షల యకరాల భూమి సాగులోకివచ్చి, విద్యుచ్ఛక్తిలాంటి వసతులు విస్తృతమయి యుండవచ్చును. కాని ప్రజల నిత్యజీవితంలో నిలకడైనస్థాయి, ఆదాయవ్యయాలకు ఒకవిధమైన సామరస్యము ఏర్పడినదాంటే, అదిలేదు సరికదా ప్రజల ఆర్థికదుస్థితి మరింతక్లిష్టమగుచున్నది. ప్రతియొక్క నిత్యావసరం ధరవరలు పెరుగుదల స్థాయిలోనున్నవికాని నిన్నటికంటె నేడు మెరుగుగానున్నదని కాని, నేటికంటె రేపటికి మెరుగుకాగలదనే ఆశకు అవకాశములు బొత్తిగాకనుపించుటలేదు. ఈ పరిస్థితులలో మూడవపంచవర్ష ప్రణాళికా నిర్వహణనుద్దేశించి కేంద్రరాష్ట్రప్రభుత్వాలు క్రొత్తపన్నులను తలపెట్టడం ప్రజలను మరింత చీకాకుపరచి అసంతృప్తి కలిగించడం కాగలదేమోనని మా అభిప్రాయం.

అయితే తలపెట్టిన అభివృద్ధి అభ్యుదయాలు అవసరంలేదాయంటే జవాబు అవసరమనే; కాని ప్రజలలో అశాంతి, అసంతృప్తి కలుగజేసి అభివృద్ధి అభ్యుదయాలను అయిదు సంవత్సరాలలో సాధించపూనుకోడంకంటే ప్రజలపై ఎక్కువబరువు,

భారములు లేకుండా వారి సహాయ సహకార సానుభూతులతో పది సంవత్సరాలలో, 15 సంవత్సరాలలో సాధించడం దేశానికి, ప్రజలకుకూడ క్షేమకరం.

ఈ సందర్భమున అధికారములోనున్న జాతీయ కాంగ్రెస్ నాయకత్వము ప్రజాదరణను, సహకారమును కోల్పోయే సూచనలు యిప్పటికే కనుపిస్తున్నవి. ప్రజల యోగక్షేమాలను లక్ష్యంచేయని ఏ రాజకీయ నాయకత్వము వర్ధిల్లడంకష్టము. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ అభివృద్ధి అభ్యుదయ పథకాలను ప్రజల యోగక్షేమాలతో అన్వయింపజేసి అమలుజరపాలి.

తలపెట్టిన నూతన పన్నులను అవకాశంగా తీసికొని అధికలాభాలకు ప్రాకులాడే ఉత్పత్తిదారులు, వ్యాపారస్తులు సయితం ప్రజాహితులు, దేశహితులు కానేరరు. ప్రజలైనా దుబారా, ఆరోగ్యభంగమును కలిగించే నిత్యావసరాలను పరిమితం చేసుకుంటే అన్నివిధాల మంచిది.

---

Statement about ownership and other particulars about newspaper GRIHALAKSHMI to be published in the first issue every year after the last day of February

FORM IV

(See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of Publication | ... | M/s Kesari Kuteeram Private Ltd. 15, West Cott Road, Madras-14 |
| 2. Periodicity of its publication | ... | Monthly |
| 3. Printer's Name | ... | Dr. S. Seshagiri Rao, *for* M/s Lodhra Press |
| Nationality | ... | Indian |
| Address | ... | 15, West Cott Road, Madras-14 |
| 4. Publisher's Name | ... | Dr. S. Seshagiri Rao, *for* M/s Kesari Kuteeram Private Ltd. |
| Nationality | ... | Indian |
| Address | ... | 15, West Cott Road, Madras-14 |
| 5. Editor's Name | ... | Sri C. C. Punniah |
| Nationality | ... | Indian |
| Address | ... | 15, West Cott Road, Madras-14 |
| 6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | ... | 1. Mrs. K. Sarada Nedungadi<br>2. Dr. S. Seshagiri Rao<br>3. Dr. T. M. B. Nedungadi<br>4. K. Radhakrishnan<br>5. Mrs. K. Vasantha<br>15, West Cott Road, Madras-14 |

I, Dr. S. Seshagiri Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) S. SESHAGIRI RAO,
*Publisher.*

Dated: 15-3-61

# త్రాగుబోతు


జర్మను మూలం :
హాన్స ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ




## ఇంతవరకు సాగినకథ

[ ''త్రాగుబోతు'' కథ ఆ ప్రాంతాలలో వాణిజ్యంలో పేరు ప్రఖ్యాతులు గాంచిన ''సొమ్మర్'' అనే ఆయన జీవితపు ఘట్టాలని చిత్రిస్తూంది. భార్య మాద్గా సహాయసంపత్తి మూలాన ఇంతవరకు జీవిత రథాన్ని సవ్యంగా నడిపినవాడే. కాని చుక్క ఎదురైంది. దాంతో త్రాగుడికి అలవాటయ్యాడు. భార్యను నలుగురి ముందర అవమానం చేసి ఆవిడ దగ్గర చీవాట్లని తిని బయటపడ్డాడు. భార్య కోరిక డాక్టర్ల సహాయంతో భర్తని తిరిగి దోవలోకి తీసుకుని రావాలని. కాని ''సొమ్మర్'' దీనికి లొంగే ఘటం అయితేగా! తప్పత్రాగుతూ డాక్టర్ల నుంచి తప్పుకుంటూ వాళ్ళ వూరికి సమీపంలోనే వున్న పేటలో ''లోబెడాన్స'' అను కార్మికుడి ఇంట్లో మకాం పెట్టాడు. లోబెడాన్స ఆవలిస్తే ప్రేగులని లెక్కపెట్టగలిగే కాలాంతకుడు. సొమ్మర్ తత్త్వం అవగాహనచేసుకుని చేయాలసిన మోసం చేశాడు. సొమ్మర్‌కి ఇప్పుడు కావలసింది డబ్బు. గతరాత్రి భార్యను హడలగొట్టి వాళ్ళ ఇంట్లో నుంచి కొంత సామాను దోచుకుని వచ్చాడు. దాన్ని ఇప్పుడు గుటకాయిస్వాహా చేయాలని లోబెడాన్స ప్లాను వేస్తున్నాడు. ఆ సంగతి సొమ్మర్ పసికట్టాడు. అతన్ని పనిమీద బయటికి పంపివేసి వేకువ జామున్నే సొమ్మర్ అక్కడినుంచి బయలుదేరుతాడు — ఇక చదవండి.]

## I

మా లోబెడాన్స ఎటుకేసి వెళ్లాడో? కొట్లు కట్టివేసివున్నా దుకాణ యజమానుల ఇండ్లకి వెళ్ళి నాకు కావలసిన వస్తువులని తీసుకుని రమ్మని పురమాయించాను. చేతికి అందిన నోట్లని ఇచ్చివేశాను. దాంతో అతను వుబ్బితబ్బిబ్బయిపోతూ వెళ్ళిపోయాడు. ఆ పరిసరాలనే వదిలిపెట్టి వచ్చేశాను. దోవలో ఎక్కడా కనబడలేదు. ఇంకేం ప్రమాదం లేదనుకుంటూ గబగబ స్టేషనుకేసి నడిచాను. ఇంకా అప్పటికి బాగా తెల్లవారలేదు. స్టేషనులోనే కొంతసేపు వుండిపోయి తరువాత చేయాలసిన పనులు తాఫీగా ఆలోచించుకోవచ్చని లిన్నగా లోపలికి ప్రవేశించాను. లోపలి భాగంలో హోటలు వుంది. అదే ప్రయాణీకుల విశ్రాంతిశాల కూడా. ఎంతోమంది లోపలికి వచ్చి వెడుతూ వుంటారు. వాళ్ళల్లో నాకు తెలిసినవాళ్లు వుండవచ్చు. వాళ్ళే నన్ను అక్కడ చూశాక వాళ్ళ వైఖరి ఎలా వుంటుందో అవగాహన చేసుకోవచ్చు. దానినిబట్టి నా రథాన్ని ఎటుకేసి కదలించాలో ఒక నిర్ణయానికి రావటానికి కూడా అవకాశముంటుందిగా!... సామాన్య ప్రయాణీకులు వుండే హోటలు భాగం వుంది. పై క్లాసుల్లో ప్రయాణం చేస్తూవుండే బాటసారులకోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడ్డ భాగమూ వుంది. ఇలాటి సమయంలో అలాటి భాగంలోనే వుండి

కాఫీ పుచ్చుకోటం అన్నివిధాలా మంచిదనుకుంటూ అటుకేసి వెళ్ళాను. అక్కడ కాలకృత్యాలు పూర్తి చేసుకుని కాఫీకి ఆర్డరిచ్చాను. కాఫీ అంటే సామాన్యపు కాఫీ అయితేగా! నా ఆర్డరు ప్రకారం ప్రశాంతంగా కూర్చుండి తినటానికి అవసరమైన భోజన పదార్థాలని పనిమనిషి తెచ్చి బల్లమీద అమర్చాడు. వాటిని రుచిచూస్తూ అక్కడున్న వార్తాపత్రికలని తిరగవేయటానికి ప్రారంభించాను. నా మామూలు ప్రపంచం వదలిపెట్టి ఇటు అజ్ఞాతవాసంలోకి రావటం ఎన్నో రోజులక్రిందట. ఈ రోజుల్లో లోకపుతీరు ఎలావుందో తెలుసుకోటానికి వుబలాటపడుతూ మా వూరి స్థానికవార్తలని ఆత్రంతో చదివాను. వాటిలో నా సంగతి ఎక్కడా కనబడలేదు. అంటే నేను భయపడుతూ వున్నట్లు నా భార్య నన్ను గురించి ఇంతవరకు ఎలాటి చర్యని బహిరంగంగా తీసుకోలేదన్నమాట! ఇంకో విధంగా నా పత్తాను తెలుసుకోటానికి ఎత్తులు పన్నవచ్చు. అంచేత పత్రికలోనున్న ప్రకటనలకేసి చప్పున నా దృష్టి మరలింది. ఆ భాగంలో ఎన్నెన్నో ప్రకటనలు వున్నాయి. వాటిలో కూడా నా సంగతి ఏ రూపానా పేర్కొనబడకుండా వుండటం చూశాక ఇంకేం ఫరవాలేదనుకుంటూ మందహాసం చేశాను. బల్లమీద అమర్చబడ్డ వస్తువులని ఒక్క క్షణంలో ఖాళీచేసేసి క్రొత్త వాటికి ఆర్డరు ఇచ్చాను. నా గొప్పతనాన్ని చుట్టుప్రక్కలవాళ్ళకి తెలపటానికి ఘాటుపదార్థాలని తీసుకుని రమ్మని హోటలు మనిషితో చెప్పాను....

ఈ సమయంలో నాకు బాగా తెలిసిన పెద్దమనిషి లోపలికి రావటం చూశాను. మా వూళ్ళో బేకరీ యజమాని యీ పెద్దమనిషి. 25 సంవత్సరాల నుంచి ఆయన వ్యాపారము జయప్రదముగా జరుగుతూ వస్తున్నది. ఈ మధ్యనే పెద్దపండుగ చేసుకున్నాడు. ఆయన సంస్థకు కావలసిన గోధుమపిండిని మేమే ఎంతోకాలంనుంచి సప్లయి చేస్తూ వున్నాము. ఆయన నన్ను చూస్తూ ఆప్యాయంగా పలకరించాడు. నా ప్రక్కనే పెట్టె వుండటం చూస్తూ వ్యాపార విషయంలో ఏ వూరో వెళ్ళి వస్తున్నానని అనుకుంటూ వెళ్ళినపని జయప్రదంగా జరిగిందా అని అడిగాడు. అంటే ఆయనకు మా ఇంటి రభస బొత్తిగా తెలియదన్నమాట... ఆయన లోపలికి వెళ్ళిపోవటంతోనే మరికొందరు తారసపడ్డారు. వాళ్లు నాకు చూపిన మర్యాదలో కూడా ఎలాటి మార్పు కనబడలేదు. అప్పటికి తొమ్మిది గంటలయింది. హోటలు పనిమనిషిని పిలిచి అతనికి చెల్లించాలసిన సొమ్ము ను చెల్లించి కూర్చున్న చోటినుంచి తిన్నగా లేచాను.

## II

తొమ్మిది గంటలకు వూళ్ళో కొట్లు తెరుస్తారు. రైలు పేటలోనుంచే వూరి మధ్యకు వెళ్ళే దోవ వుంది. పెట్టెని పుచ్చుకుని అటుకేసి గబగబ నడిచాను. వూరి మధ్యనే మా బ్యాంకు వుంది. బ్యాంకుకి ఎదురుగానే ప్రభుత్వపు భవనం. ఆ భవనం క్రింది భాగంలోనే పోలీసు స్టేషను. నిన్నటిరాత్రి మాద్గా నామీద టెలిఫోనులో రిపోర్టుచేసింది ఈ స్టేషనువాళ్ళకే.... అక్కడికి కొంచెం దూరంలోనే మా వ్యాపారసంస్థ. ఈపాటికి తలుపులు తెరిచే వుంటారు. మాద్గా నా కుర్చీమీద కూర్చుని పనిపాటలు చూసుకుంటూ వుండవచ్చు. బయటి వూళ్ళనుంచి వచ్చే సామానుబండ్లు భవనం ముందర ఈ వేళకి ఆగి వుంటాయి. రైతులు మాద్గాని చూడటానికి ఆత్రుత పడుతూ లోపలికి వెడుతూ వుంటారు.

అదంతా గొడవ. పెద్దగొడవ. దాన్నంతా నెమరు వేసుకుంటూ బుర్ర పాడుచేసుకుంటూ వుంటే ప్రయోజనమేమైనా వుంటుందా? ఇప్పుడు నాకు కావలసింది గుండెనిబ్బరం. అది లేకపోయిందా ఇంకేం వుంది?...

ఇప్పుడు నేను వెళ్ళాలసింది మా బ్యాంకులోకి. బ్యాంకు అప్పుడే తెరవటంమూలాన రద్దీ ఏం లేదు. గుమాస్తాలు వాళ్ళవాళ్ళ స్థలాల్లో కూర్చునివున్నారు. చుట్టుప్రక్కల వీధుల్లోవున్న వ్యాపారసంస్థలనుంచి వచ్చిన పనిమనుషులు వాళ్ళవాళ్ళ పనులని చూసుకోటానికి అప్పుడే లోపలికి అడుగెడుతున్నారు. మా ఖాతాకి సంబంధించిన గుమాస్తా ఖాళీగానే వున్నాడు. నేను తెచ్చుకున్న పెట్టెని క్రిందపెట్టాను. వేసుకున్న ఓవర్‌కోటు, హ్యాట్ తీసి నాకు ప్రక్కనే బెంచిమీద వుంచాను. గుమాస్తాకేసి చూసి మందహాసం చేస్తూ జేబులోనుంచి చెక్‌బుక్ పైకి తీస్తూ మా ఖాతాలెక్కలో ఇప్పుడెంత సొమ్ము వుందో తెలపమని అడిగాను. నా ఇప్పటి వాలకం చూడటంతో ఎన్నో రోజులు బయటి వూళ్ళల్లో వ్యాపార సందర్భంలో వుండిపోయి ఇవ్వాళ ప్రొద్దుటి రైల్లో నుంచి దిగి తిన్నగా బ్యాంకుకేసి వస్తున్నానన్న సంగతి తెలుసుకోటం అంత కష్టమైన పని కాదు. గుమాస్తా తల వూపుతూ తన ముందువున్న పెద్ద పుస్తకాలని

తిరగవేస్తూ చిత్తుకాగితంమీద ఏవేవో సంఖ్యలని వేస్తూ, కూడుతూ, తన మామూలు ధోరణిలో ఏడు వేలా ఎనిమిది వందల ఒకమార్కు ఏబయి ఫెన్నింగులు (అంటే సుమారు ఎనిమిదివేల రూపాయలు కొంత చిల్లర వున్నదన్నమాట) మా జమలో వున్నదని అన్నాడు. మార్గా ఖచ్చితపు మనిషి. మా వ్యాపార సంస్థతో నాకేం సంబంధంలేదని బ్యాంకువాళ్ళకి ఇంతవరకు తెలపకుండా వుండటం చూస్తే దానికి ఏదో పెద్దకారణం వుండితీరాలి. మేం కంట్రాక్టు పని చేస్తున్న సంస్థల్లో పెద్దది మా వూరి కారాగృహం. నా తెలివితక్కువ మూలాన వాళ్ళతో కొన్ని పేచీలు పెట్టుకున్నాను. అవి అన్నీ తేలేటంతవరకూ బయటివాళ్ళకి నా సంగతి చెప్పకుండా వుండటం మంచిదనుకున్నది కాబోలు. ఆ పద్ధతినే బ్యాంకుపట్ల కూడా చూపెట్టి వుండాలి. అదంతా ఇప్పుడు నా పనికి ఎంతో వూతనిచ్చింది....

గుమాస్తా చెప్పిన వివరాలను వినటంతో ఇప్పుడెంత సొమ్ము తీసుకుంటే మంచిదో చప్పున ఒక నిర్ణయానికి రావాలి; ఇలాటి నిర్ణయానికి వచ్చేటప్పుడు మార్గాపట్ల ఎలాటి దయాదాక్షిణ్యాలు చూపకూడదని అనుకున్నాను. మా వ్యాపార సంస్థకూ ఖాతాదారులకి చెల్లించాలసిన సొమ్మంతా ఇప్పుడు బ్యాంకులో వుంది. దాన్ని ఇప్పుడు గుటకాయస్వాహా చేశానా మార్గా రాత్రి చేసిన అఘాయిత్యానికి తగిన గుణపాఠము చెప్పినవాడినవుతాను! జమలోవున్న సొమ్మునంతా తీసుకుంటేనో?... ఆ సంగతి విన్నాక మార్గా హడలిపోతుంది. సంస్థనే కొంతకాలం కట్టివేసి ఇంట్లో కూర్చోవాలని వస్తుంది... నా అస్త్రం దానికోసం నదురూబెదురూ లేకుండా వుపయోగించానా నాకసి అంతా కాకపోయినా కొంతవరకైనా తీరుతుంది!... ఇంకోవైపు జాలి! ఇప్పటికి మార్గాపట్ల చూపెట్టిన అత్యాచారం కాకుండా కొంప యిలా ముంచివేయటమా?...

ఏం చేయాలనుకున్నా ఈ క్షణంలో చేయాలి. ఏమాత్రం ఆలస్యం చేశానా విషమిస్తుంది. అంతా విషమిస్తుంది. తరువాత అనుకుంటే లాభం వుంటుందా?...

నా ముందర చెక్ బుక్ వుంది. తల గిరగిర తిరుగుతూ వుంది. ఇప్పుడే అరికట్టాలి. వున్న మనోబలాన్నంతా చీకూచింతా లేకుండా వుపయోగించాలి. గుమాస్తానడిగి ఆయన కలం పుచ్చుకుని పెద్ద మొత్తాన్ని వ్రాసి సంతకంచేసి చెక్ ని పుస్తకంలో నుంచి తీసి ఆయన చేతికిచ్చాను. వ్రాసిన మొత్తం అయిదు వేలు. అంతా దాన్లో వుదహరిస్తే అనుమానానికి తావునిస్తుంది. అయిదు వేలు! సామాన్యమైన మొత్తమైతేగా ఇంత సంఖ్య? దీంతో యీ నా రథాన్ని ఇద్దరినుంచి అద్దరికి సునాయాసంగా కదలించవచ్చు. తరువాత సంగతా?... ఆ విషయం ఇప్పుడు తలపోసుకుంటూ మనస్సు చిందరవందర చేసుకోటమా?...

గుమాస్తా చెక్కుని పుచ్చుకున్నాడు. పుస్తకంలో వ్రాసుకుని చెక్కుమీద ముద్రవేసి సంతకం చేశాడు. దాన్ని కాషియర్ వున్నచోటికి పంపుతూ అక్కడికి వెళ్ళి సొమ్ముని పుచ్చుకొనమని పురమాయించాడు. తిన్నగా అక్కడికి వెళ్ళాను. క్యాషియర్ ఈ సందర్భంలో తను చేయాలసిన తతంగం అంతా పూర్తిచేసుకున్నాక నాకేసి చూస్తూ —

“ఏమండీ సోమర్ గారూ! సొమ్ము ఏ రూపాన ఇయ్యమంటారు?” అని యాంత్రికంగా అడిగాడు.

“పెద్ద నోట్లలోనే ఇయ్యండి. అంటే రెండు వందలు చిల్లర చిన్న నోట్లలో ఇచ్చేసి మిగతాడబ్బు నూరు నోట్లలో ఇస్తే సరిపోతుంది” అన్నాను....

రెండు నిమిషాల్లో అక్కడి పని అంతా ముగిసింది. ఆయన ఇచ్చిన నోట్లని రెండు కట్టలుగా కట్టి చొక్కా లోపలి జేబులో జాగ్రత్తగా దాచిపెట్టుకుంటూ, బల్లమీద దాచివుంచిన ఓవర్ కోటుని వేసుకున్నాను. హ్యాట్ ని పెట్టుకుని క్రిందనుంచిన పెట్టెని పుచ్చుకుని బ్యాంకు భవనంలోనుంచి ప్రశాంతంగా బయటికి వచ్చాను. అప్పటికి ఇంకా ప్రొద్దుపోకపోయినా అక్కడికి సమీపంలో నేవున్న హోటల్లో కొంచెం మంచి పానీయాన్ని రుచిచూస్తూ వుండిపోయి తరువాత చూసుకోవాలసిన పనిని తాపీగా ఆలోచించుకోవచ్చని నా కోరిక.

భవనంలో నుంచి బయటపడ్డానో లేదో అక్కడ నా ముందర ప్రత్యక్షమైంది లోబెడాన్స్! ఎక్కడి నుంచి వూడిపడి వచ్చాడో ఈ కాలాంతకుడు? ఆ పాపిష్టి ఘటాన్నుంచి తప్పించుకొని వచ్చినందుకు ఇంతవరకు వుబ్బితబ్బిబ్బయిపోతూ వున్నాను. ఇప్పుడు ఈ శని ఇక్కడ దాపరించాడు? ఎంత వినయవిధేయతలు చూపుతున్నాడు నన్ను చూస్తూ ఆ పిచ్చినవ్వు నవ్వుతూ?...

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామి చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఈ మంత్రమునందుగల భాషలో అనేక వాక్యలోపములున్నవి. భావావేశమానములు కలవు. ఇట్టి నాటక ప్రదర్శన క్షణములందు ఇట్లుండుట సొగసుగనున్నది. భావావేశములు, ఆలోచనల సాగనీయనప్పుడు, అభిప్రాయములు తీక్ష్ణమగునపుడు, భాష సామాన్య వ్యాకరణసూత్రముల నతిక్రమించిపోవును. భాష ఆవిరిగ మారిపోవును. ఆశ్చర్యములుగ, విస్మయములుగ ఆగిపోవును. ఆత్మానుభవము పొందగల ఉత్కృష్టసమయములలో, ఊపిరి కూడ కదలని క్షణములలో, భాష తొట్రుపడును. విచ్ఛిన్నమగనుండును. ఆగిపోవును. లేక నత్తిమాటలు వెలువడును. పై మంత్రమునందలి తాత్పర్యము తెలుపుటలో, వాక్యముల వరసను వదలియున్నాము. లోపములను పూరించి, సాధ్యమగువరకు, పూర్ణ భావము వెలిబరుచ యత్నించియున్నాము.

ఈ మంత్రమున, ఆత్మ, తన పరిశుద్ధ, విజ్ఞానములో, ఎఱుకతో, స్థూలశరీరము ప్రవేశించు సమయమున పొందు అనుభవము వర్ణింపబడుచున్నది. ఆత్మ, బాహ్యమునగల ద్వంద్వగుణోపేత ప్రపంచమును, విషయేంద్రియముల, మనోబుద్ధుల ద్వారా చూచెను. అట్లు చూచుటవలన, విషయేంద్రియములు, మనసు, బుద్ధి, అన్నియు ఎల్లెడల తన స్వరూపమునే చూపుచున్నవి. ఎల్లెడల పురుషుడే వ్యాపించి, సర్వ విషయములను కప్పియుండుట దర్శించెను. అందువలన, గగుర్పాటు కలిగెను. ప్రశాంతమనసుతో, ఆత్మానుభవము పొందు సమయములలో, ఇట్టి అనుభవము కలుగుట సహజము. అనుభవఫలముగ అతడు "ఆహా! నేను దీనిని చూడగలిగితిని" అని కేక వేసెను. వేదాంత భావయందు, ఆత్మను "ఇదం", ఇది అను సర్వనామముతో తెలుపబడుచుండును. వేదాంత పరిభాషయొక్క పరిచయము లేకయే, ఉపనిషత్తుల ననుసరించుట శిష్యులకు చాల కష్టతర కార్యము.

అది, ఇది అను సర్వనామములను, రెండు వస్తువులను తెలుపుటకు మనము వాడుచుందుము. అది అనబడు వస్తువు, ఇది అనబడు వస్తువునకన్న దూరముగనున్నదని భావము. గోడకు మనకు మధ్య అనేక వస్తువులుండినచో, మనకు సమీపమునయుండుదానిని ఇది యందుము. దూరమున గోడ సమీపమునయుండు దానిని అది యందుము. అట్లు వాడుటలో, ఆ గోడయని, ఈ బల్లయని, నా చేతియందలి ఈ పుస్తకమని, ఆ పుస్తకము, ఈ నాపైనుండు అంగీయనియు, ఆ చొక్కాయి, ఈ నా మనసు అని, ఆ మనసు, ఈ బుద్ధియని, సమీపమున యుండుదానిని ఇది యని తెలుపుచుందుము. ఇట్లు పలుకుచు పోగా, కొంతకాలమునకు, ఇది యనునది పరిపూర్ణ ఏక "ఇది" యగుచున్నది. "ఇది" యనబడు విషయమున, అది అనగల వ్యవహారమే లేకపోవును. ఏలన, దానికన్న సన్నిహితముగనుండు వస్తువు మరొకటి లేదు. మనకు అతిసమీపమునయుండు ఆత్మ కేంద్రమునకన్న సన్నిహితముగనుండి, ఆత్మను "అది" అని తెలుపగల కేంద్రము మరొకటిలేదు. కనుక, అట్టి ఆత్మ కేంద్రమును ఇచట "ఇది" అని తెలుపబడెను.

ఇట్టి పవిత్రమగు భావమువలన, వేదాంత పరిభాషయందు, ఇది అనబడు సర్వనామముయొక్క ఉపయోగమును గుర్తెరుగ గలిగినచో, పై మంత్రమున గూఢముగ దాగియుండు భావసౌందర్యమును కనుగొనగలము. "ఆహా! నేను దీనిని చూడగలిగితిని" అను మాటల విలువను తెలిసికొనగలము.

ఈ మంత్రముయొక్క భావము, "సృష్టికి పూర్వము ఆత్మయొక్కటే యుండెను" అను భావమును స్థిరీకరించుచున్నది. ఒక రూపమును సృష్టించి, దానియందు నేత్రములు మొదలగు శక్తులను కలిగించి, ఆత్మ ఎఱుకతో, కించిత్ ఆత్మ మరుపులేక, ఆత్మ ప్రవేశించి, ద్వంద్వపూరిత బాహ్యప్రపంచమును, జ్ఞానసహితముగ దృష్టించగా, జ్ఞానేంద్రియముల

ద్వారా, ఆత్మ తన పరిపూర్ణరూపమునే పవిత్ర దృశ్యముగ, ప్రపంచరూపముగ చూడగలిగెను.

శ్రుతుల విచారించు పాఠకుడు, ఈ మంత్రము నందలి భావములపై ధ్యానముంచగలిగినచో, ఇందు గల ప్రశాంత, పవిత్రభావము, జ్ఞానసంపద, ఆనందము, వైభవము, గగుర్పాటు కలిగించగలదు. మనము ప్రతియొక్కరును, ఆ ఆదిపురుషుని స్వరూపములే. విడివిడిగ సృష్టింపబడినను, ఆ పరమాత్మ మనలో ప్రవేశించియున్నాడు. కనుక మనము ఈ శరీర మనో బుద్ధులతో గల తాదాత్మ్యముల తొలగించుకొని, ఇప్పటికైనను, మన దైవికస్వభావ గుణములతో, శుద్ధజ్ఞానస్వరూపులుగ, బాహ్యప్రపంచమును దర్శించ గలిగినచో, ఆ సత్యపరమాత్మను, అచలప్రతిష్టమును, శాశ్వతమును, అవికారిని, ప్రశాంత స్వరూపుని, పరిపూర్ణుని, అమృతస్వరూపుని, ఆనందస్వరూపుని, ఎల్లెడల తాండవమాడుచుండు ఆత్మను కనుగొనగలము. ఇట్టి అనుభవము పొందగలిగినవారు, ప్రతియొక్కరు, "ఆహా! నేను దీనిని చూడగలిగితిని" అని ఆనందభరితులై, గానము చేయగలరు.

ఇచ్చట, చూచెను, అనగా, సామాన్యముగ, నేత్రములతో చూచు దృశ్యమని తలచకూడదు. సామాన్యముగ, మనము మనకు అన్యముగనుండు విషయములను, నేత్రేంద్రియముల సహాయమున చూచుచున్నాము. అందు చూచు ద్రష్ట వేరు. దృశ్యము వేరు. ద్రష్ట. దృశ్యము, దృక్కు అను సంబంధము కుదురుటవలన ఈ అనుభవము కలుగుచున్నది.

కాని, ఆత్మసాక్షాత్కారమున, ఆత్మ, ఆత్మనే చూచుకొనుచున్నది. కనుక, ఈ చూచుకొనుచున్నది - అనుటలో, విశేషభావమున్నది. ఒక వస్తువును చూచుట అనగా, అది యున్నది అను నమ్మకము కలుగుట, దానిని తెలిసికొనుట, దాని పరిచయము పొందుట. ద్రష్టకు దాని అస్తిత్వమున ఎట్టి సంశయము లేకుండుట. ఆత్మ దర్శించబడెను - అనగా, ఆత్మానుభవము కలిగెను అను వేదాంత భావము గ్రహించవలెను. ఈ అనుభవము సర్వ సంశయరహితముగ నున్నది. అందు భ్రమలకు ఆస్పదము లేదు. నమ్మతగినది. దృఢమైనది. ఆత్మను ప్రత్యక్షముగ కండ్లతో చూచునట్టి అనుభవము కలిగెనని భావము.

శ్రు॥ తస్మా దిదన్ద్రో నా మేదన్ద్రో హ వై నామ. త మిదన్ద్రం సన్త మిన్ద్ర ఇ త్యాచక్షతే. పరోక్షేణ. పరోక్ష ప్రియా ఇవ హి దేవాః పరోక్షప్రియా ఇవ హి దేవాః॥ (14).

[అందువలన, అతడు ఇదం - ద్ర (ఇదం = ఇది, ద్ర = చూచువాడు = దీనిని చూచువాడు) అనబడును. అతని పేరే ఇదంద్రం అని నిలిచిపోయెను. అతనిపేరు ఇదంద్రం అని స్థిరమైనను, అతడు ఇంద్రయని పిలువబడును. దేవతలు పరోక్షప్రియులు. దేవతలందరు పరోక్షప్రియులు. దేవతలెల్లప్పుడు పరోక్షముగ పిలువబడుటయందు కుతూహలము గలవారు.]

సర్వవ్యాపియగు పరబ్రహ్మము నతడు తనయందు "ఇదం" అను రూపమున తెలిసికొనెను. గనుక అతనిని ఇదంద్రమని పిలుతురు.

సామాన్య జీవితవ్యవహారములందు, గొప్పవారు, మర్యాదస్థులు, వారి పేర్లతో పిలువబడుటలేదు వారి బిరుదులతో సామాన్యముగ పిలువబడుదురు ప్రధానమంత్రిగారని, ఘనులని, ప్రభువని, పూజ్యులని, ఏలినవారని, ఇన్స్పెక్టరు సాహెబని, బాబూజీయని, వెలకొద్ది పరోక్ష మర్యాదపేర్లతో పిలుచుచున్నాము. మరియు, గృహములందు మన తల్లులను, "నాన్నగారి భార్య" యని పిలుచుటలేదు. మరియు భరతఖండమున ఏ సాధ్వీమణియు తన పెనిమిటిని పేరుతో పిలువ సమ్మతించదు.

మర్యాద, గౌరవము చూపవలసిన చోటులందు, పేర్లతో మనము పిలువ సమ్మతించము. మారుపేర్లతో మర్యాదసూచకముగ పిలుచుదుము. మర్యాద పురుషుని, గొప్పవారిని, సత్పురుషులను, మేధావులను, దైవస్వరూపులని యెంచుదుము. వారిని పరోక్షముగ పిలుచుట వాడుక. అతనిపేరు ఇదంద్ర మనబడినను, మర్యాదవలన, పేరు చిన్నదిగ నుండుటకై, మారుపేరుగ నుండుటకై, ఇంద్ర యని పిలువబడును.

## 5 భాగము

### ద్వితీయోధ్యాయము - ప్రథమ ఖండము

[అపక్రామన్తు గర్భిణ్యః] పురుషే హ వా అయమాదితో గర్భో భవతి. య దేత ద్రేతః త దేత త్సర్వే భ్యోఽఙ్గే భ్య స్తేజః

(142 వ. పేజి చూడుడు)

# గంగా స్రవంతులు

శ్రీమతి చిలకమర్తి సీతామహాలక్ష్మి

రామారావుగారు విశాఖపట్టణంలో పేరుపొందిన లాయరు. ఆయనకు సంవత్సరానికి పది లక్షల ఆదాయంవచ్చే యెస్టేటు కూడా వుంది. కాని ఆయనకు మగపిల్లలు లేరు. ఇద్దరు ఆడపిల్లలు మాత్రం కలరు. పెద్దపిల్ల పేరు గంగ. ఏడేళ్ళ వయస్సు గలిగి చూచుటకు చాలా అందంగా యుంటుంది. చాలా తీవ్ర స్వభావురాలు. పట్టినపట్టు విడువదు. రెండవ కుమార్తె స్రవంతి నాలుగేళ్ళ పసిపాప. అందచందాలలో అక్కను మించింది. ఒకనాడు రామారావుగారి భార్య వాణీదేవి పిల్లలిద్దరిని తీసికొని ఎగ్జిబిషను చూడటానికి వెళ్ళింది. పిల్లలకు కావలసిన వివిధమైన వస్తువులు కొని పెద్దపిల్ల పేచీపెడితే ఒక నగలషాపులోనికి వెళ్ళి ఒక రవ్వల నెక్లెస్సు ఒక గంటసేపు చూచి సెలక్టుచేసి వర్తకుడు తనను యెరిగినవాడగుటచే పుస్తకంలో సంతకంపెట్టి డబ్బు వెనుకనించి పంపిస్తానని చెప్పి కారు వద్దకు వచ్చింది. అక్కడ చిన్నపిల్లనెత్తుకునుంచున్న దాది చిట్టెమ్మ లేదు. యీమెను చూసి ప్రక్క హోటలులో టీ త్రాగుచున్న డ్రైవరు వచ్చి అమ్మా! చిన్నపాపగార్ని తీసుకుని చిట్టెమ్మ మీకోసం షాపులోకి రాలేదా అన్నాడు. దానికి వాణీదేవి కంగారుపడి; లేదు ఎటు వెళ్లారో చూసి రమ్మని డ్రైవరుని పంపింది. ఎంత వెతకినా కనబడలేదని డ్రైవరు చెప్పాడు. అప్పుడు వాణీదేవి పక్కనున్న షాపులో టెలిఫోను తీసికొని పోలీసు ఇన్స్పెక్టరుకి వెంటనే తన యింటికి వచ్చి మాట్లాడవలసిందని చెప్పి ఇంటికి వెళ్ళిపోయింది. నలుగురు పోలీసులను తీసికొని ఇంటివద్ద హాజరుగా వున్నాడు. పోలీసులను చూచి రామారావుగారు కంగారుతో మేడ దిగివచ్చి సమాచారమేమిటని ప్రశ్నించారు. సమాచారమేమిటో మాకును తెలియదు. అమ్మగారు అర్జంటుగా రమ్మని ఫోనుచేస్తే వచ్చాము అన్నాడు ఇన్స్పెక్టరు గణేశం. ఇంతలో వాణీదేవి హడావిడిగా వచ్చి భర్తను చూచి కన్నీళ్ళతో సర్వనాశనమైపోయింది. మాటలేనా తిన్నగారాని పసిపిల్లను తీసికొని దాసీముండ పరారీ అయిపోయింది. వెంటనే ఆ ముండ నగలకోసం పిల్ల ప్రాణం తీయకుండా వెతికి పట్టుకొంటారని పోలీసులను పిలిచాను అనిచెప్పి ఏడవటం మొదలుపెట్టింది. రామారావుగారామాట విని నిశ్చేష్టుడై ఎంతపని జరిగింది. లేక లేక గలిగిన యిద్దరాడపిల్లలలో ఒకపిల్లను చేతులార పోగొట్టుకున్నామే. పిల్ల వంటిమీద పదివేలు విలువగల నగలు కూడా వున్నాయి. ఆ ముండ యింతవరకు పిల్లప్రాణం తీయకుండా వుంటుందా! సొమ్ము పాపిష్టిది గదా అన్నారు రామారావుగారు. ఇన్స్పెక్టరు - ధైర్యంగా వుండండి! సార్! జరిగిపోయినదానికి విచారించి ప్రయోజనము లేదు. పిల్లయొక్క దాది ఆనమాళ్లు చెప్పి పిల్ల ఫొటో యిమ్మన్నారు. వాణీదేవి పిల్ల ఫొటో తెచ్చియిచ్చి మా పిల్లలిద్దరికి ఎడమ అరికాలిలో మామిడిపిందె ఆకారంలో వుండే పుట్టుమచ్చలున్నాయి. ఆ ఆనమాలుతో పిల్ల యెంతకాలానికి దొరికినా మనం గుర్తించవచ్చు అని ఆమె చెప్పిన ఆనమాళ్లు వ్రాసుకొని ఫొటో తీసికొని వెళ్ళిపోయాడు. ఎంత వెదకినా పిల్ల జాడ కనిపించలేదు. పిల్ల బెంగతో వాణీదేవి మంచంపట్టింది. పురుషుడగుటచే రామారావుగారు దుఃఖాన్ని దిగమ్రింగి గంగనే సర్వస్వంగా చూచుకుంటూ కాలం గడుపుతున్నాడు. కాలగర్భంలో పదిహేను సంవత్సరాలు గడిచిపోయాయి. గంగ మదరాసులో ప్లీడరు పరీక్ష చదువుతోంది. రామారావుగారి మేనల్లుడు సాగర్ ఇంగ్లండునుంచి డాక్టర్ డిగ్రీ పుచ్చుకుని వచ్చి మదరాసులో సర్జనుగా పని చేస్తూన్నాడు. సాగర్ తల్లిదండ్రులు ధనమే ప్రధానంగా చూసే వ్యక్తులగుటచే మేనగోడలు గంగను తమ కొడుకునకు చేసుకుంటే రామారావుగారి యావదాస్తి వస్తుందని రావుగారి చెల్లెలు భవానమ్మగారు అన్నగారితో అబ్బాయికి తొందరగా వివాహం చేసెయ్యాలి, నాకు, మీ బావగారికి నీ కూతుర్ని చేసుకోవాలని వుంది అంది. అనగా రామారావుగారు భార్యా పుత్రికల అంగీకారము పొందిన వెంటనే ముహూర్తం నిశ్చయమొనర్చి, మేనల్లుడిని తీసుకు

రమ్మని బాపట్లదిని పంపించారు. అక్కడ దాసీ దానిచే మదరాసు అనాధ శరణాలయం కాంపౌండులో చంపుటకు చేతులురాక విడిచిపెట్ట బడ్డ స్రవంతి శరణాలయంలో పెరిగి పెద్దదై, 'విమల' అనే పేరుతో సద్గుణవంతురాలనిపించు కుంటూ కాలం గడుపుతూంది. ఒకనాడు స్రవంతి బజారుకు వెళ్ళి బట్టలు కొనుక్కొని అనాధయైన తన ముందు జీవితానికి ఆధారమేమిటా యని ఆలోచిస్తూ వస్తోంది. ఇంతలో ఒక కారు వేగంగా వచ్చింది. ఎన్నిసార్లు హారన్ కొట్టినా అన్యమనస్కురాలైన ఆమెకు వినబడలేదు. ఇంతలో కారుచక్రం క్రింద ఆమె కాలు పడింది. ఆమెకు తెలివితప్పింది. కారులో వున్న డాక్టరు సాగర్ — ఆమెను కారులో వేసి తన హాస్టలుకి తీసుకొని వెళ్ళి చికిత్సచేశాడు. ఆమెకు తెలివివచ్చిన తరువాత ఆమె చరిత్ర అడిగాడు. ఆమె తానొక అనాధనని చెప్పింది. క్రమంగా యిద్దరికి స్నేహం వృద్ధి అయింది. తనకు భార్య కాదగ్గ సౌందర్య సద్గుణాలు ఆమెలో చూచి సాగర్ ఆమెను ఆమెకిష్టమైతే వివాహమాడతానన్నాడు. అందుకామె మీరు విద్యాధనాలు కలిగియున్న సంపన్నులు. నేను ఒక అనాధను. నావంటిదాన్ని వివాహం చేసుకుందుకి మీ పెద్దలు సంఘము కూడా హర్షింపవు అన్నది. అంత సాగర్ సంఘంతోగాని పెద్దలతోగాని నిమిత్తంలేదని తనుక ఎన్ని ఆటంకాలకైనా లెక్క చేయక ఆమెనే వివాహం చేసుకుంటానని వాగ్దానం చేశాడు. అందుకామె అంగీకరించి, అతని ఉదార హృదయానికి జోహారులర్పించింది. ఇద్దరు మాట్లాడు కుంటూ యింటికి వచ్చేసరికి మబ్బులేని పిడుగులా సాగర్ తండ్రి వూడిపడ్డాడు. కొడుకుని, ఆమెను చూస్తూనే ఉద్యోగం వంకతో యిక్కడవుండి నీవు ఆడే నాటకం యిదా. ఇటువంటి కులటల మాయలో పడి పెళ్ళి కూడా చేసుకుందుకి అంగీకరించలేదు ఇందుకా. ఎన్ని వుత్తరములు వ్రాసినా వివాహానికి నీ అంగీకారం తెల్పని కారణంవల్ల నేనే స్వయంగా వచ్చి నీ నడత చూశాను. ఇకనైనా బుద్ధితెచ్చుకుని నాతో వచ్చి మీ మేనమామ కూతురు గంగని పెళ్లి చేసికో. అన్ని ఏర్పాట్లు చేసేవచ్చాను. నీవు వద్దన్నా ఆగదు అన్నాడు. అంత సాగర్, నా అనుమతిలేనిదే నాకు వివాహపు ఏర్పాట్లు చేశారు. ఇంగ్లండు దొర సానిగా స్వేచ్ఛగా తిరిగే గంగను చేసుకోవటం నా కిష్టంలేదు. నా మనసుకు నచ్చిన యీ అమ్మాయినే వివాహం చేసుకుంటాను. మీరు నా సుఖంకోరే వారైతే యీమెనే నాకు వివాహంచేయండి అన్నాడు సాగర్. కొడుకు మనస్సు తన మాటలకు మారదని నిశ్చయించుకున్న సూర్యనారాయణగారి మనస్సులో ఒక ఆలోచన తట్టింది. పైకి సరే నాయనా ప్రాజ్ఞుడవైన నీ మాట నేనెందుకు కాదనాలి యీ అమ్మాయితోనే నీ వివాహం జరిపిస్తానుగాని, యీ ముహూర్తం మార్చుటకు వీలు లేదు అని చెప్పగా విమలా సాగరులు సంతోషించి ఆయనకు పాదాభివందనం చేశారు. ఆయన వెంటనే లేచి అమ్మాయికి కావలసిన చీరలు, నగలు దగ్గర వుండి చూచుకుంటుంది. యీ అమ్మాయిని నాతో తీసికెడతాను అనిచెప్పి ప్రయాణంచేసి బజారుకు వెళ్ళి వస్తానని వూరులోకి వెళ్ళి పదిమంది రౌడీలను వెతకి వారికి కొంత డబ్బిచ్చి రాత్రి ఒంటిగంటకు తానొక పిల్లను తీసికొచ్చి వప్పచెపుతానని, ఆమెను బంధించి దూరదేశం తీసికొనిపోయి విడిచిపెట్టవలసిందని చెప్పి యింటికి వచ్చాడు. విమలను తీసికొనివచ్చి చీకటిలో ఊరిబైట కాచుకొని కూర్చున్న రౌడీలకు వప్ప చెప్పాడు.

విశాఖపట్టణం వెళ్ళి సాగర్ వివాహం గంగతో ఏర్పాటుచేశాడు. సరిగా వివాహసమయానికి యింటికి వచ్చిన సాగర్ పెండ్లిపీటలపై నున్న పెండ్లి కూతురువైపు చూశాడు. ఆమె విమల కాదు గంగ. కెవ్వున కేకపెట్టి సాగర్ తిన్నగా రైలు స్టేషనుకు పరుగెత్తి సిద్ధముగానున్న మెయిలులో పడ్డాడు. వికలమనస్కుడై యింటికి వచ్చి పడుకున్నాడు. వెంటనే ఎవరో వచ్చి డాక్టరు బాబూ సీరియస్ కేసు అని వెంటనే రావాలన్నాడు. సాగర్ వెంటనే వారితో హాస్పటల్ బెడ్ మీద వున్న రోగిని చూచి విమలా! అని కేకపెట్టినాడు. విమలకు తెలివి రాలేదు. ఇంతలో కాఫీ ఫ్లాస్కు తీసికొని చక్కని ఆకార లక్షణాలతో వున్న యువకుడక్కడకు వచ్చి, డాక్టరుగారూ! సముద్రములో యీదుతూయున్న నా చేతికి యీమె శరీరం తగిలింది. వెంటనే యీమెను రక్షించి హాస్పటలుకు చేర్చాను. ఈమె బ్రతుకుతుందంటారా అని ప్రశ్నించాడు. ఈమె కేమి భయంలేదు అని చెప్పి ఆమెకు అమోఘమైన చికిత్సచేశాడు. ఆమెకు తెలివి వచ్చింది. సముద్రములో పడిన కారణమడిగాడు. ఆమె ఆయనను గుర్తుపట్టి జరిగిన సమాచారం అంతా చెప్పింది.

యువకుడు - డాక్టరుబాబూ! గొప్ప విశేషం.

ఈమె ఎడమకాలు చూడండి. కాలిపైనున్న మామిడి కాయ మచ్చ చూశారా. ఈమె నీ మేనమామగారి రెండవ కుమార్తె స్రవంతి అనిచెప్పి తన జేబులో వున్న తన తండ్రిగారి డైరీ తీసి చూపించి, తండ్రి గారితోపాటు తాను కూడా యీమెను వెదకుటకు ప్రయత్నిస్తున్నానని తన పని అప్రయత్నంగా సఫలమైనదని చెప్పి వారిని సంతోషసాగరంలో యీదులాడించాడు. వారంతా ప్రయాణమై విశాఖపట్టణం వచ్చారు. ఇన్‌స్పెక్టరుగారితో కొడుకు శంకర్ స్రవంతి సమాచారమంతా చెప్పి, అంతా కలసి రామారావుగారింటికి వచ్చారు. రామారావు దంపతులు యీ సమాచారం విని స్రవంతిని చూచి గుర్తుపట్టి పోయిందనుకున్న పిల్లను బ్రతికించి తమకిచ్చినందుకు సంతోషించి, పెండ్లిపీటలపైనుంచి హఠాత్తుగా లేచిపోయి తమ్ము అవమానించిన కారణమేమని సాగరును అడిగారు రామారావుగారు.

అందుకు కారణం మీ చిన్నపిల్ల స్రవంతినే అడగండన్నాడు సాగర్. అప్పుడు స్రవంతి జరిగిన కథంతా చెప్పింది. గంగకు పెళ్లికొడుకును సాగర్ను వెదకమన్నారు. అంత సాగర్, 'చేతిలో వెన్న నుంచుకొని నేతికి బాధపడ్డట్లు' వరుని వెతకుట ఎందులకు? మనకు మహోపకారమొనర్చిన యీ శంకరునకిస్తే బాగుంటుందని, ఏమయ్యా శంకర మహాశయా! ప్రళయ తాండవమొనర్చుచు, దివి నుండి భువికి దిగివచ్చే యీ గంగాభవానిని శిరస్సున ధరించుటకు నీవే సమర్థుడవు అనగా శంకర్, స్రవంతీ పతియైన సాగర్ మహాశయుని కంటె నేను సమర్థుడనని తోస్తే శిరస్సున ధరించుటకు నాకు ఏమీ అభ్యంతరం లేదన్నాడు శంకర్. పెద్దలంతా ఆనందోత్సాహాలతో గంగా - శంకరులకు, స్రవంతీ - సాగరులకు వివాహ మహోత్సవం జరిపారు.

# చిత్రాంగి

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి



[ అది ఒక అందమైన భవనము. దాని దాపున ఒక పూదోట.... సన్న జాజి, మనోరంజని చెట్లున్నవి. మేడపైన నవయవ్వని చిత్రాంగి ఉన్నది.]

చిత్రాంగి:-హృదయమా! ఎందుకు నీకింత తొందర? తప్పక వస్తాడు. మాట్లాడుతాడు. ఏలా మరపించి వలపించుకుంటావో! అవును. నీ సౌందర్యాన్ని, వలపును ప్రదర్శించాలి! నీ హృదయనాథుని ముందు కాకపోతే ఎవరిముందు చూపిస్తావు!

పావురమా? ఎంత మంచిదానవమ్మా! ఈనాటికి నా పతిని సందర్శించి పరామర్శించే భాగ్యం కలిగించావు! ఆజన్మాంతము నీకు కృతజ్ఞురాలిని. స్త్రీ సహజాలంకారాలైన సిగ్గుదొంతరలను నేడు పొందగలుగుతున్నాను. ఏమిటో! సారంగధరుని గురించి వినగానే నా హృదయం ఎందుకు పులకరిస్తుంది? వంపులు తిరుగుతుంది? మరచిపోయాను. సుగాధాని పులుముకోవాలి! అలంకరించుకోవాలి! కోమలీ, సారంగధరుడు వస్తే లోపలకు ప్రవేశింపజెయ్యి!

[ సారంగధరుడు తన ప్రాణప్రదమైన పావురం చిత్రాంగి మేడపై వ్రాలినదని తెలిసివస్తాడు.]

కోమలి:-ఎవరూ! యువరాజులా! రండి! ఆగిపోయారేం.

సారంగ:-నాన్నగారున్నారా?

కోమల:-లేరు యువరాజా!

సారంగ:-కోమలీ! నా పావురాన్ని తీసికొని రాగలవా?

కోమలి:-నాకు తెలియదు రాజా! అమ్మగారిని చూడండి!-

సారంగ:-సరె. వెళతాను. తరువాత తీసికుంటాను.

(ప్రకృతి చూచి తెల్లని పట్టుచీర నల్లని వినీలముంగురులు నుదుట నాట్యంచేస్తుంటే దరహాస భాసుర వదనంతో సుందరి చిత్రాంగి మేడ మెట్లు దిగుతూ)

చిత్రాంగి:-(సానునయంగా) సారంగధరా! వెళుతున్నావా?

సారంగ:-ఎవరూ? పిన్నిగారా! నమస్కారమమ్మా?

చిత్రాంగి:-తప్పు! సారంగధరా! నాకు నమస్కరింపకూడదు. నేను నీకన్నా చిన్నదాన్ని!

సారంగ:-అయినా మాతృమూర్తివి గదా!

చిత్రాంగి:-నేనెలా అవుతాను సారంగా! రా సారంగా రాకరాక వచ్చావు. విశ్రాంతి తీసికొని వెడుదువుగాని.

సారంగ -ఒంటరిగా నేనుండటము మంచిది కాదు!

చిత్రాంగి:–సారంగా! ఎందుకలా భయపడతావు! నీ మనసు నిర్మలముగా లేదా? నేనేమనుకోనులే ..

సారంగ:-అయినా లోకులు...

చిత్రాంగి:–ఎందుకు నీకా అనుమానం?...

(సారంగధరుడు విశ్రాంతి మందిరంలో ఉంటాడు. ఫలహారానంతరం చిత్రాంగి అతనికి ఎదురుగా కూర్చుని ఉంటుంది.)

చిత్రాంగి:-సారంగా! నిన్ను చూస్తుంటే ఎందుకో నా హృదయం స్వర్గధామంలో విహరిస్తుంది. నిన్ను చూడాలని ఎన్ని రోజులనుండి ఎదురుచూస్తున్నాను. ఎందుకు నీవసలు రావు?

సారంగ:-అదేమిటి? నాన్నగారు లేని సమయంలో అంతఃపురానికి నేనెలా రాను?

చిత్రాంగి:–మీరేమో రారు. మిమ్ము చూడాలని నా వాంఛ. విభిన్న ప్రకృతులు గల మన సాంగత్యము ఏలా సంభవము?

సారంగ:–సాంగత్యమా?

చిత్రాంగి:–అవును సారంగా! హృదయంలో రగిలే అగ్నిజ్వాలలను అణిచిపెట్టి నన్ను నేనే మోసం చేసికోలేను. ఈనాడైనా భగవంతుడు నా హృదయ కావ్యాన్ని వినిపించే అవకాశం కల్పించాడు. సావధానముగా విను. చివరకు నీ హృదయపూర్తిగా నే నడచకోవచ్చు.

సారంగ:–ఇదేమిటమ్మా! ఈ ధోరణి.

చిత్రాంగి:–ఆనాడు మీ నాన్నగారు నాకు పంపిన చిత్రలేఖనము ఈ నా ఎదురుగా నున్న సుందరాంగునిదంటే నమ్ముతారా!

సారంగ:–అవును...నిజమే...

చిత్రాంగి:-ఆ హృదయాన్ని సుందరాంగునికే అంకితంచేశాను. ప్రథమక్షణంలోనే అర్పించేశాను. ఈనాడు మీ నాన్నగారు పొందుతున్నది నా జీవరహిత శరీరాన్ని మాత్రమే సారంగా! ఈవిధంగా ఎన్నిరోజులు హృదయాన్ని అణచేది?

సారంగ: తల్లీ! ఇవి మీరు అనవలసిన మాటలా! మీరు నన్ను ప్రేమించినా, వివాహమాడినది మా తండ్రిగారిని కదా! భర్తను ప్రేమించి తరించటమే భారత స్త్రీమూర్తి ధర్మము. అంతేకాని ఈలా పరపురుషుని వాంఛిస్తే కులటగా వ్యభిచారిణిగా నిందలు మోపవలసివస్తుంది. మాంగల్యాన్ని ధరించిననాడే మీరు వారి వశమైనారు. వారి అర్ధాంగివి కనుక వారికి సేవచేసి పుణ్యాన్ని సంపాదించాలి. అంతేకాని ఈవిధంగా చెడునడవడి వలన మన నిష్కళంకమైన రాజవంశానికే కళంకము ఆపాదిస్తారా?

చిత్రాంగి:–సారంగా! అదే నేను వేడుకొనేది! ప్రథమ దర్శనంలోనే నీ రూపు నా హృదయంలో హత్తుకపోయింది. అతడే నా భర్త! నా పతి! నా సర్వస్వమూను. ఈనాడు మీ నాన్నగారు నా పంకపంకిలమైన మాంసగోళాన్ని అపవిత్రం చెయ్యగలిగారు కాని నా హృదయం నా పతి చరణాలపైననే

ఉన్నది. ఈ విషయం వారికి బహుశా వారికి అర్థమయి ఉండదు. వారు నా చెంతఉండి సరసాలాడుతున్నా...నా హృదయం అందుకు ఎంతో ఎదురు తిరుగుతుంది. కాని ఏంచేసేది? భరించ లేని బాధపడతాను. ఒక్కొక్కసారి అనిపిస్తుంది గదా! నీతో ఒక్కరాత్రి నిర్మలంగా గడిపి ఈ తనువును త్యజించాలనిపిస్తుంది. ఇంతకంటే నేనెట్లా చెప్పగలను. నా హృదయాన్ని చీల్చి చూసినా మీ రూపే ఉంటుంది.

సారంగ:-ఈవిధంగా మీరు విషయలాలసకు దాసులైతే ఎట్లు? నిగ్రహించుకోవాలి! అయినా మీ వాదం నచ్చటం లేదు। పతితాప్రవాహంలో పడితే మరలా మీరు ఒడ్డెక్కలేరు. మీరు రూపాన్ని చూసి భ్రమించవద్దు. ప్రేమ ప్రధానముకాని మోహమా?

చిత్రాంగి:-నా వాదం నీకు నచ్చదుసారంగా నాకు తెలుసు. అయినా నా హృదయ భావాప్రవాహాన్ని బయటకు పంపిమైనా... లేక నిన్ను క్షమాభిక్ష వేడికొనిమైనా బాధను వ్యధను త్యజించాలనుకున్నాను. కాని విధి అందుకు పూర్తిగా వ్యతిరేకమయింది.

సారంగ:-ఏమిటమ్మా యిది?

చిత్రాంగి:- ఏముంది సారంగా, నిజంగా నీవన్నది కూడా నిజమే! కాని నేను ప్రథమంనుండి నిన్నే ప్రేమిస్తున్నానే! నీపొందే వాంఛిస్తున్నానే, నేను ఏ పాపమెరుగని అమాయకురాలనే, మీ నాన్నగారు చేసిన మోసానికి కుట్రకు నా జీవితాన్ని నిష్ఫలపాలు చేస్తావా? నేను పతితగా మ్రగ్గవలసిందేనా? ఎందుకు నాకీ శిక్ష! నిరుపమానమైన సౌందర్యాన్ని కలిగియున్నాను. నిర్మలమైన రాజవంశంలో జన్మించాను. అంతకన్నా అందమైన హృదయ నాథుడు లభించాడనుకొన్నాను. కాని ఆశలన్నీ నిరాశలైనవి. నా జీవితపథమే అంధకారమైంది. ఈ జీవితనావకు గమ్యస్థానమేది? ఎవరికొరకు జీవించాలి! ఏ ఆశతో బ్రతికేది? సారంగా! నీవు చెప్పు సారంగా?

సారంగ:-అమ్మా! మీరు చెప్పినది నేను కాదనలేను కాని...

చిత్రాంగి: (ఆదుర్దాగా) కాని .. చెప్పు సారంగా... కాని....

సారంగ:-మన బాంధవ్యము ఏమిటో తెలుసా! నీ కోర్కె నేనంగీకరిస్తే... రౌరవ నరకం అనుభవించాల్సి వస్తుంది.

చిత్రాంగి:-ఏమి బాంధవ్యము సారంగా! మనము కల్పించుకున్నదే గదా! నా హృదయంలో సతీపతుల బాంధవ్యము ఏనాడో నిర్ణయమైంది. అంతే..ఏనాడో అనుభవించాలి అనే నరకానికి వెరచి ఆ నరకాన్ని ఈ లోకంలోనే అనుభవించలేను. ఏలా సారంగధరా। నీ సమక్షంలో చనిపోయినా నా ఆత్మకు సంతృప్తి కలుగుతుంది. సారంగ! నా హృదయసంద్రపుటలలను యింక అణచలేను. నా యవ్వనజ్యోతి యింకా శోభాయమానమౌతున్నది. ఈ జన్మను సార్థకం చెయ్యి! న్యాయంగా నా భర్తను పొందటానికే నేను ప్రయ

త్నము చేస్తున్నాను. ఈ బంగారు పంజరంలో విముక్తి లేక కృశించే నాకు స్వేచ్ఛావాయువులను ప్రసాదించు.

సారంగ:-ఏమిటీ? యింత భోగేచ్ఛా! నీకు పుత్రసమానుణ్ణి!

చిత్రాంగి:_సారంగధరా! భోగేచ్ఛ అన్నపుడు నీ హృదయం ఎంత అందంగా ఉంది. ఒక్కసారి నా కోర్కె తీర్చు! రా సారంగా భరించలేను.

సారంగ:_మీరు బాధపడతారని మీ వాదన విన్నందుకు యిదా ఫలము?

చిత్రాంగి:-జీవితానికే ముసుగు వేయలేను సారంగా: రా.

[అని చేయి పట్టుకుంటుంది.]

సారంగ-(వదలించుకొని) యిదెక్కడి అన్యాయము?

చిత్రాంగి:-నేను స్త్రీనన్న మాట మరచిపోకు. నేను అన్యాయముగా వాంఛించటము లేదు. ఓహో! నేను కామానికి దాసురాలనై నిగ్రహంలేనిదానిగా భావిస్తున్నావా? సారంగా! నేను మోహానికి కామానికి దాసురాలను కాలేదు. పవిత్రప్రేమకు అయినమాట వాస్తవము. ఈ హృదయాన్ని నీ కర్పించి ఏలా కాదనేది?

సారంగ:_ఏది ఏమైనా యీ జన్మకింతే నమ్మా!

చిత్రాంగి:-అయినా యిందులో నా దోష మేముంది సారంగా?

సారంగ:_వస్తానమ్మా... నీవు ఈ విధంగా తర్కించుకొని మనసును పాడుచేసికో వద్దు. (వెళతాడు)

చిత్రాంగి:_పాడు...యింకేమి పాడు... నా జీవితమే నాశనమయింది. భగవంతుడా! నాకింత లేతప్రాయంలోనే యింత వ్యథ. ఉన్నపాటున మరణింప చేయకూడదా! లోకంలో ఈ పాత్రకు నేనే దొరికానా....శరీరనాథుడు చెంత చేరితే చికాకు. హృదయనాథుడా తిరస్కరించాడు. ఈ కాలచక్రంలో పడి నలిగిపోవలసిందేనా భగవంతుడా?

కథానిక

# తేలని ప్రశ్న

శ్రీ సాయినాథశాస్త్రి

శేఖరంగారప్పుడే అన్నంతిని కూర్చుని పేపరు చదువుతున్నారు. ఇంతలో పోస్టుజవాను ఉత్తరం తెచ్చిచ్చాడు. చదువుతున్నారు. ఏముందీ — రామం అంటే శేఖరంగారి పెద్దకొడుకు. మేనత్త కూతుర్ని పెళ్లి చేసుకోటానికి ఒప్పుకున్నానని తండ్రికి రాశాడు. ఇది చదువుకుని శేఖరంగారు ఉబ్బితబ్బిబ్బయ్యారు. భార్య సరోజినికి చెప్పాలిది. సరోజిని కంతగా యిష్టంలేదు. కొడుకు డాక్టరు — కట్నం బాగా రావాలని. ఎట్లాలేదన్నా వో పాతిక వేలన్నా లాగాలని ఆశ. మేనరికం చేసుకుంటే పాతిక వేలు కాదుగదా, కనీసం పాతిక వందలన్నా ముట్టవు. అట్లాగని మరీ యిష్టం లేకనూపోలేదు. ఆడబిడ్డకి తనంటే మొదట్నుంచీ మహాప్రేమ. అమ్మాయి కూడా బుద్ధిమంతురాలూ, పనిమంతురాలూను, అందచందాలకి లోటులేదు. కొడుకేమంటాడో రాసి కనుక్కోమని భర్తతో చెప్పి రాయించింది సరోజిని. దానికే యిది సమాధానం.

ఆ వుత్తరాన్ని చదువుతుంటే శేఖరంగారికి తన పూర్వజీవితం కళ్లల్లో మెదిలింది. వెంటనే లేచెళ్ళి, పెట్టెలోంచీ వొక పాతబడిపోయిన కాగితాన్ని చేత్తో పుచ్చుకుని కుర్చీలో కూర్చుని కళ్లు మూసుకున్నారు — జరిగిన సంఘటలన్నీ వరసాగ్గా గుర్తొస్తున్నై —

♦ ♦ ♦

రామారావుగారు వాళ్ళనాన్న పోయేటప్పటికి స్కూలుఫైనలు చదువుతున్నారు. వాళ్ళనాన్నకు కొడుకే కలక్టరో అవ్వాలని మహాఆశగా వుండేది. కానీ పాపం ఏం చేస్తారు! ఆశ ఆశగా వుండగానే బాల్చీ తన్నేశారు. అప్పటికి రామారావు వయస్సు 18 ఏళ్లు. అప్పట్నుంచీ బడికి ఎగనామం పెట్టేశాడు. తల్లి కూడా ఎక్కువగా బలవంతపెట్టలేదు. చిన్నప్పట్నుంచీ పొలంపనులంటే సరదా కావటం మూలాన సొంతంగా వ్యవసాయం సాగించాడు. ఆ యేడాది రెండు పుట్ల గింజలు లాభం వొచ్చినై. తల్లికూడా కొడుకు ప్రయోజకుడైనందుకు చాలా సంతోషించింది.

రామారావుగారి నాన్న బ్రతికుండగానే రామారావుకి పిల్లనిస్తామని రామారావుగారి మేనత్త కబురు చేసింది. రామారావు నాన్న తనకొడుకు కనీసం ఏ బియ్యేనో అయింతరవాత తప్పక చేసుకుంటానని హామీ యిచ్చాడు. ఇంతలో అనుకోకుండా యిట్లా జరిగింది. రామారావుగారి తల్లి ఆడబిడ్డగారింటికెళ్ళింది. చూడ్డానికెళ్ళిందేమోనని వూరుకున్నాడు కొడుకు. పొలం దున్నుకునే పల్లెటూరి మొద్దుకి మా అమ్మాయి నివ్వమని ఖచ్చితంగా చెప్పేశారు వాళ్లు. తలవొంచుకుని తిరిగొచ్చేసింది. రామారావుగారి కిది తెలిసింది. వాళ్ళిట్లా అంటారని తాను ముందే వూహించుకున్నాడు. పోనీలెమ్మని వూరుకున్నాడు. తత్పర్యవసానంగా మూడు నెలల్లో రామారావుగారికీ, ఆ వూళ్ళోనేవున్న ఒక సామాన్యపు రైతు కూతురికీ పెళ్లి జరిగిపోయింది. దీనివల్ల రామారావుకి ఏం నష్టం కలగలేదు సరిగదా లాభించిందనే చెప్పాలి. అట్లా భార్య రావటం ఏమిటీ యిట్లా వ్యవసాయం గూడా మూడు పువ్వులూ, ఆరు కాయలుగా పెరిగిపోయింది. ఏడాది తిరిగేటప్పటికి ఒక కొడుకు గూడా పుట్టాడు. అతగాడి పేరే శేఖరం! తనకి ఎట్లాగూ చదువుకునే యోగం లేకపోయిందని, కొడుకుని జాగ్రత్తగా చదివించారు రామారావుగారు. తత్ఫలితంగా శేఖరం, ఎమ్.ఏ. ప్యాసయ్యాడు.

ఇప్పుడు మళ్లా వీళ్ళతో సంబంధబాంధవ్యాలు కలుపుకోవాలని ఆ రామారావుగారి మేనత్తా వాళ్ళే వుబలాటపడుతున్నారు. తమ అబ్బాయి సుందరరామయ్య కూతురు రమని శేఖరానికి చేసుకోమంటున్నారు. శేఖరానికి పాతవిషయాలన్నీ తెలుసు. యింకా గుర్తున్నై. కానీ రామారావుగారు అవన్నీ మరిచేపోయి అబ్బాయి కిష్టమైతే తమ అభ్యంతరం ఏమీలేదని చెప్పారు.

అక్కణ్ణుంచీ శేఖరం వెంటపడి వేధించటం మొదలు పెట్టారు. శేఖరం కోసమే రమ పుట్టిందట! శేఖరం, రమలు యీడూ జోడూ కూడా బాగుంటుందిట! శేఖరం ససేమిరా చేసుకోనన్నాడు. కట్నం ఆశ పెట్టారు. ఊహుఁ! శేఖరంవినలేదు. శేఖరానికితెలిసిన

ప్రతివాడి చేతా చెప్పించారు రమని పెళ్ళి చేసుకోమని. శేఖరంకి ప్రాణం విసిగిపోయింది. తనతో యిక ఆ విషయం ప్రస్తావించొద్దని శేఖరం ఖచ్చితంగా నిర్మొగమాటంగా చెప్పేశాడు. అది మొదలూ శేఖరాన్ని తిట్టిపొయ్యటం మొదలెట్టారు. కనిపించిన ప్రతివాడితోనూ శేఖరాన్ని గురించి చెడ్డగా ప్రచారం చెయ్యటం సాగించారు. చివరకు వొక రోజున ప్రత్యేకం పనిగట్టుకుని వచ్చి "ఏదో కావాల్సినవాడివి గదా అని చేసుకోమన్నాం! అంతేగానీ నీ అందచందాలూ, గుణగణాలూ చూసికాదు. ఇంతటి సంబంధం దొరక్క కాదు. దీనితల్లో జెజెమ్మలాంటి సంబంధం తెస్తా చూసుకో"మంటూ వెళ్ళిపోయారు.

దాంతో వాళ్ళకీ, వీళ్ళకీ మధ్య రాకపోకలు ఆగిపోయినై. రామారావుగారితో ఎవ్వరూ మాట్లాడేవాళ్ళు కాదు, యింటికెప్పుడూ వచ్చేవాళ్ళూ గాదు. రామారావుగారే ఎప్పుడన్నా వెళ్ళి చూసి వస్తూండేవారు. శేఖరం వుద్యోగ ప్రయత్నాలు చేశాడు. హైదరాబాద్‌లో వుద్యోగం వచ్చింది. వెళ్ళి జాయినైనాడు. రామారావుగారే ఎప్పుడన్నా వెళ్ళి కొడుకుని చూసి వస్తూండేవారు. శేఖరం దసరా శెలవలకి యింటికొచ్చాడు. శేఖరం వచ్చిన కొద్దిరోజులకే ఎవరో పిల్లనిస్తామని వచ్చారు. అంతా వెళ్ళారు పెళ్ళికూతుర్ని చూసేందుకు. అందరికీ నచ్చింది. వెంటనే లగ్నాలు కూడా పెట్టుకున్నారు. రామారావుగారు అందరికీ శుభలేఖలు అచ్చుకొట్టించి పంపించారు. శుభలేఖలు ప్రత్యేకం శేఖరం పట్టుకెళ్ళాడు రమా వాళ్ళింటికి. ఇంటికొచ్చినవాణ్ణి కనీసం పలకరించనన్నా, పలకరించలేదు. పోనీ లెమ్మని వూరుకున్నాడు శేఖరం. మాట్లాడకుండానే శుభలేఖలు చేతికిచ్చాడు. విసిరి పారేశారు. చీకటితో పోదామని ఆరోజు అక్కడే వుండిపోయాడు.

సాయంకాలమైంది. అట్టా పొలాలకేసి బయల్దేరాడు శేఖరం. ఒక్కటే ఆలోచనలు — "ఏమిటిది? ఎందుకింత కక్ష? మా నాన్నకి చేసిన అవమానం మరిచిపోయారుగామాన్లు. మా నాన్నకి చదువేం లేదనేగా అట్టా చేశారు, మొదట పిల్లనిస్తామని. మా నాన్నే పనికిరానప్పుడు నేను మాత్రం ఆ తండ్రి కొడుకునిగానూ? నేనెట్టా పనికొస్తానో వాళ్ళతో సంబంధ కలుపుకోటానికి!" అని ఆలోచిస్తూ తిరిగి తిరిగొచ్చాడు. ఇంటికొచ్చేటప్పటికి చీకటి పడుతోంది. ఇంట్లో ఎవరూ వున్నట్టులేదు. చెప్పులు వరండాలో విడిచి, దొడ్లోకెళ్ళి కాళ్లు కడుక్కొచ్చి కూర్చున్నాడు ఆలోచిస్తూనే.

ఇంతలోనే రమ వచ్చింది. పేరంటానికి వెళ్ళింపట్లే వుంది — కాళ్ళకు పసుపు రాచుకుంది. చేతిలో అరటిపళ్ళూ అవీ వున్నై. వస్తూనే — "ఎంతసేపైంది బావా నువ్వొచ్చి? అమ్మా, నేను పేరంటానికెళ్ళాం! నాన్నేదో పనుందని ప్రక్కవూరికెళ్ళారు. దా లోపలికి" అంటూ లోపలికెళ్లి దీపం వెలిగించి మంచం వాల్చింది. శేఖరం మాట్లాళ్ళేదు.

"ఇట్లా వచ్చి మంచంమీద కూర్చో బావా!" అంది రమ.

"ఎందుకులే రమా! ఫరవాలేదు. ఎక్కడైతే యేంలే!" అన్నాడు.

"కోపం వచ్చిందా బావా?"

"ఎందుక్కోపం?"

"మా అమ్మా, నాన్నా పలకరించలేదని."

"అబ్బే! కోపమెందుకూ? పోస్టులో పంపిస్తే సరిపోయే. కానీ, నేనే పట్టుకొస్తే ఎట్లా వుంటుందోనని వచ్చాను. తెలిసుండే వచ్చినప్పుడు యింకా కోపం దేనికి?" అన్నాడు కాసేపు మెదలకుండా వూరుకున్నారు.

ఉన్నట్టుండి చటుక్కున "బావా! నేనొకటడుగుతాను నిజం చెబుతావా?" అంది రమ.

"ఆఁ!" అన్నాడు శేఖరం.

"నన్ను చేసుకోటానికి నీకేమిటభ్యంతరం? నేను బాగుండకనా? చదువు లేదనా? నీ అంతస్తుకి తగననా? లేక కట్నం చాలకనా? ఎందుకని చేసుకోనన్నావు?" అని సూటిగా అడిగింది రమ.

శేఖర్ ఒక్కక్షణం రమవంక చూశాడు. "కూర్చో రమా! నీతో చాలా విషయాలు చెప్పాలి" అన్నాడు శేఖరం. రమ స్తంభానికానుకుని కూర్చుంది చెప్పమన్నట్టుగా. శేఖరం తన తండ్రి పెళ్ళికి జరిగిన విశేషాలన్నీ విడమరిచి చెప్పాడు దాచకుండా. చెప్పి "ఇది రమా! అసలు విషయం. ఏం? మా నాన్నని అవమానిస్తే నన్నవమానించినట్టుగాదూ? మేమూ మీలాంటి మనుష్యులమే. మాకూ మానాభిమానాలూ, గౌరవ మర్యాదలూ వున్నై" అంటూ వుద్రేకంగా అన్నాడు శేఖరం. వెంటనే రమవంక చూశాడు పరీక్షగా. రమ తలవంచుకుని వింటోందనుకున్నాడు యింతసేపూ. కాదు ఏడు

స్తోందని గ్రహించాడు శేఖరం. మెదలకుండా వూరుకున్నాడు. రమ కాసేపాగి కళ్లుతుడుచుకుని –

“బావా! ఒకళ్లు చేసిన తప్పుకి మరొకళ్ళకి శిక్ష వెయ్యటం న్యాయమేనా? మా పెద్దవాళ్లు ఏదో చేశారని నన్ను యిట్లా బాధించటం బాగా వుందికదూ? అట్లా అని నిన్ను ఆత్మాభిమానం చంపుకోమనటంలేదు? మా వాళ్లు చేసింది తప్పు కాదని సమర్థించబోవటంలేదు కూడాను. నీ యిష్టం! కానీ చిన్నప్పట్నుంచీ నీమీద పెట్టుకున్న ఆశలు ఒక్కసారిగా వదల్లేకుండా వున్నాను. ఏదేదో చెప్పి నిన్ను కష్టపెట్టదల్చుకోలేదు. ఇక నా అదృష్టంలో ఎట్లా రాసిపెట్టుంటే అట్లా జరుగుతుంది” అంది రమ.

శేఖరం నిశ్చేష్టుడైపోయాడు. “రమ తనను భర్తగా వూహించుకుందా! కలలోగూడా తానూహించలేకపోయాడు. రమ నాటకమాడుతుందేమో? వాళ్ల నాన్న, అమ్మ యిట్లా అనమన్నారేమో? ఛ! ఛ! రమ అల్లాంటిది కాదు. రమ చెప్పిన మాటలు సబబుగానే వున్నై. కానీ ఏం చెయ్యటం? రమ అందంగా లేదనా తను చేసుకోంది? తన తండ్రికి జరిగిన పరాభవానికి తగినట్లు తను ప్రవర్తించదలుచుకున్నాడు. ఏమైనా సరే! లాభం లేదిహ!” అని అనుకుంటున్నాడు శేఖరం.

శేఖరం ఆలోచనలన్నీ పసిగట్టిన రమ – “ఇంత వొచ్చింతరవాత యింకా ఆలోచన దేనికి? ఇప్పుడు నన్ను నువ్వు చేసుకుంటానన్నా, నేను నిన్ను చేసుకోను. నేను నిన్ను చేసుకుంటే నీవు నిశ్చయంచేసిన ఆ పిల్ల గతేమౌతుంది? కాబట్టి హాయిగా పెళ్లి చేసుకో. నా జన్మకింతే” అంటూ గభాలున లోపలికి వెళ్లిపోయింది. కాసేపాగి శేఖరం గూడా లోపలికెళ్లాడు. చూస్తే మంచంమీద రమ పడుకుని ఏడుస్తోంది. శేఖరం కాసేపు ఆలోచించి, మంచం దగ్గిరికెళ్లి “రమా!” అని పిలిచాడు. రమ మాట్లాలేదు. శేఖరం రమ చెయ్యి పట్టుకుని లేవదీస్తూ “ఛ! ఛ! ఏమిటిది రమా! ఏడవకు. నా తెలివి తక్కువతనం యిదంతా! నువ్వంటే నాకేం కోపం లేదు. నామీద అభిమానం అంటూ మీ వాళ్ళల్లో ఎవరికైనా వుంటే – అది నీకేనన్న సంగతి నాకు తెలుసు. దూరమాలోచించకుండా చేశానీ పని – నువ్వంటే నాకేం అయిష్టతలేదు. రమా! ఊరుకో! ఏడవకు మరి. ఏడిస్తే నామీద.” అని ఏమో అనబోతున్నాడు శేఖరం.

“రమ చటుక్కున శేఖరం నోరు తనచేత్తో మూసి “అంత మాటనకు బావా! ఏడుపు ముంచుకొచ్చింది. ఆపుకోలేకపోయాను. నా వస్తువు నెవరో బలవంతంగా లాక్కుంటున్నట్టనిపించింది” అంది రమ శేఖరం గుండెలమీద తలపెట్టి ఎక్కెక్కి ఏడుస్తూ.

శేఖరం ఒక్కసారిగా రమని గుండెల కదుముకున్నాడు. రమ కూడా శేఖరాన్ని హత్తుకుంది గాఢంగా. ఇంతలో బయట ఎవరో ‘ఏమండీ!’ అని పిలిచారు. రమ వదిలి, వదిలించుకుని గభాలున పరిగెత్తింది బైటికి. శేఖరం దూరంగా తొలగిపోయాడు.

మర్నాడుదయం చీకటితో బయల్దేరాడు రైలుకి. ఎవ్వరూ ఏం మాట్లాళ్ళేదు. రమ తను చేసినపనికేమనుకుందోనని శేఖరం కించపడ్డాడు. వెళ్తూ అందరితోనూ చెప్పి, రమతో గూడా చెప్పటానికి ఆమె గదిలో కెళ్లాడు. రమ కిటికీవైపు తిరిగి కూర్చునుంది. “రమా! వెళ్ళొస్తా!” నన్నాడు. రమ యిటువైపుకి తిరిగింది. కళ్ళవెంట నీళ్లు కారుతున్నై. శేఖరం “నన్ను క్షమించు రమా!” అన్నాడు మళ్లా.

“అంత మాటెందుకు బావా! వెళ్ళిరా! నా హృదయంలోనుంచి మాత్రం వెళ్ళలేవుగా! మళ్లా ఎప్పుడు కనిపిస్తావో” అంది దుఃఖంతో.

శేఖరం మౌనంగా నిట్టూరుస్తూ వచ్చేశాడు. స్టేషనుకొచ్చి, టిక్కెట్టు కొందామని పర్సు తీశాడు, ఏదో రంగు కాగితం కనిపించింది నోట్ల మధ్యన. టిక్కెట్టు తీసుకుని త్వరత్వరగా కదలబోయే బండిలో ఎక్కేశా. బండి బయల్దేరింది. కూర్చుని స్థిమితంగా పర్సులో కాగితం బయటికి తీసి విప్పాడు. అది రమ రాసిన వుత్తరం –

“బావా!

నీ నుంచీ నేనేం కోరను. అసలు నాకు నిన్నట్నుంచీ దేనిమీదా కోరికలేదు. నిన్ననే నాకు పరిపూర్ణమైన ప్రేమంటే యేమిటో తెలిసింది. నా జీవితానికది చాలు. నా అదృష్టం బాగావుంటే జీవించినంతకాలం అలానే గడిపేదాన్నేమో! నాకా అదృష్టంలేదు. అందుకు నువ్వు బాధ్యుడివి కావు, బాధపడకు. తప్పక నిన్ను మళ్ళా చూడగలనన్నే ధైర్యంలో వున్న

నీ

“రమ”

శేఖరానికి ఒక్కసారిగా గుండెలు పిండేసినట్టయింది, బాధగా చూచాడా వూరివైపు. అది ఎప్పుడో దాటిపోయింది కానీ, రమ యింకా కళ్ళ ముందరే నిలిచిపోయింది.

ఇంటి కొచ్చేశాడు శేఖరం. తరువాత కొద్ది రోజుల్లోనే సరోజినితో పెళ్ళి జరిగింది. శేఖరం భార్యని తీసుకుని హైద్రాబాద్ వెళ్ళిపోయాడు. ఐదారు సంవత్సరాలు సుఖంగా గడిచిపోయినై సరోజినికి. ముగ్గురు పిల్లలు గూడా కలిగారు. పెద్ద పిల్లపేరు రమ, రెండోవాడు రామం, మూడోవాడు రఘు. మొదట్లో శేఖరం కొంచెం బాధగానే గడిపేవాడు. కాని కాలం గడిచినకొద్దీ రమను పూర్తిగా మరిచిపోలేదుగానీ అంతగా బాధపడటంలేదు. రమ పెళ్లి చేసుకోలేదని, ఆ వూళ్ళోనే పంతులమ్మగా చేరిందని తెలిసింది. అంతే. మళ్లీ కబుర్లేం తెలియటంలేదు.

హఠాత్తుగా ఒకరోజున టెలిగ్రాం వచ్చింది — "రమకు జబ్బుగా వుందని, వెంటనే రావాలని" శేఖరం వున్నవాడున్నట్టుగా బయల్దేరి వెళ్ళాడు. శేఖరం వెళ్లేటప్పటికి రమకి స్పృహలేదు. నెల రోజులనుంచీ జ్వరం వస్తోందిట. డాక్టరు యిక లాభం లేదన్నాడుట. శేఖరానికి గుండెల్లో బాధ పైకెగతన్నింది. మంచంమీద కూర్చుని రమ వంకే చూస్తున్నాడు. ఎవరొచ్చి పోతున్నదీ కూడా చూడటంలేదు.

రమకు కొంచెం స్పృహ వచ్చింది. కళ్లుతెరిచి చూసింది. ఎదురుగా శేఖరం కనిపించాడు. రమ సంతోషంతో చూసింది. చేతులు చాచి "బావా! వెళ్తున్నా! మరచిపోవు కదూ! ఒక్కసారి కౌగలించుకోవూ" అంది వుత్సాహంగా. శేఖరం రమను కౌగలించుకున్నాడు. రమ "బావా! వెళ్తున్నా!" నంది. అంతే! శేఖరం రమ వంక చూశాడు. అంతా అయిపోయింది. శేఖరం వెర్రిగా ఆమె వంకే చూస్తున్నాడు. ఎవరో వచ్చి శేఖరాన్ని వదిలించి దూరంగా తీసికెళ్ళారు. శేఖరానికేం జరుగుతున్నదీ తెలియటంలేదు. జీవచ్ఛవంలాగా వున్నాడు. ఎక్కడ చూసినా రమే కనపడుతోంది. ఎవరు మాట్లాడుతున్నా రమేమోనని చూసేవాడు. చివరికి రెండు నెలలకిగానీ మామూలు మనిషి కాలేదు.

♦ ♦ ♦

శేఖరం ఇట్లా ఆలోచిస్తూనే వున్నాడు. కళ్ళల్లోంచి రెండు కన్నీటిబొట్లు కిందపడ్డాయి. ఇప్పుడు తను ముసలివాడవుతున్నాడు. ఉద్యోగంలోంచీ రిటైరైనాడు. ఇంటిపట్టునే వుంటున్నాడు. ఇప్పుడా రమా లేదు, తను ఆ శేఖరమూ కాదు. తనలో వుండే పట్టుదలలన్నీ వదలిపోయినై. తన కొడుకు మేనరికం చేసుకుంటానికొప్పుకోని మంచిపనే చేశాడు. రమ రాసిన వుత్తరాన్ని పెట్టెలో దాచి, సరోజినితో కొడుకు పెళ్ళికిష్టపడ్డాడని చెప్పుదామని యింట్లోకెళ్ళాడు. ఎప్పట్నుంచో శేఖరంగారి మనస్సులో ఒకేఒక ప్రశ్న మనస్సులో వేధిస్తోంది — తను చేసింది తప్పేనా? అని. ఏమో మరి—

# ఎర్రచుక్క

మూలం :

"సాయ్-సింగ్-చెన్"

అనువాదం :

"కేశవగోపాల్"



అవి 1932 సంవత్సరపు తొలిదినాలు!! కామ్రేడ్ "సియా-యుంగ్-మింగ్"కు అప్పటికే 40 సంవత్సరాలు దాటాయి. వయసుమళ్ళి, ముసలితనంలోకి జారబడుతున్నా, అతని కండలు తిరిగిన శరీరం వుక్కులాగ, బలిష్టంగా నలుపురంగుతో మిలమిల లాడుతూండేది! పెద్ద లావాటి పెదవులు, మెరిసే చిన్నకండ్లు, అతని బలిష్ట విగ్రహంలో ఒకవిధమైన గంభీరత్వాన్ని, సూక్ష్మబుద్ధినీ ద్యోతకం చేస్తున్నై! "సియా" మితభాషి. అవసరం కల్గినపుడే నోరువిప్పి, తక్కిన సమయాల్లో మౌనంగా, తన పనేదో తాను చూసుకుంటూవుండే అతను మాట్లాడినా, తూచితూచి మాట్లాడేవాడు. సూటిగా, నగ్న సత్యాన్ని కుండబ్రద్దలు కొట్టినట్లుగా, చెప్పవలసిన విషయాన్ని నిష్కపటంగా చెప్పేవాడు. యితరులంటే అవగింజంత భయంగానీ, జంకుగానీ అతనిలో లేవు! అంత సూటిగా, ముఖంమీద కొట్టినట్టుగా మాట్లాడే అతని పల్కులు నిజంగా యితర్లను బాధించకపోవు!

మొట్టమొదటగా అతన్ని నేను కల్సుకున్నపుడు, 'సియా' ఎర్రసైనికుల పటాలంలో వంటవాడుగా వుండేవాడు. నేను ఎర్రసైనికుల పటాలంలో సైనికుడుగా చేరినప్పటి సంఘటనలివి :

మేమంతా ఎక్కడైనా 'క్యాంపు' మారిస్తే, యిక "సియా" తన కాలాన్ని వృథాపుచ్చేవాడు గాడు! చెప్పుల్ని తయారుచెయ్యడమో, సోల్జర్లకు బట్టలు కుట్టి యివ్వడమో చేస్తుండేవాడు. మేము ఒక చోటనుండి మరియొకచోటకు బయల్దేరితే, అందరం ఎవరి వస్తువుల్ని వాళ్లు భుజానేసుకుని, కాలినడకనే "లెఫ్ట్, రైట్" కొట్టుకుంటూ వెళ్ళేవాళ్ళం!... అటువంటి సమయాల్లో 'సియా' తన వంటసామగ్రిని మోస్తూ, సోల్జర్లకు వెనుకగా, తనకు తానే స్వయంగా నియమించుకొన్న 'గార్డు'లా వెన్నంటి నడిచేవాడు.

ఎవరైనా సోల్జర్లు వెనుకబడ్డారో.. వాళ్ళని తమాషా పట్టిస్తూ, "ఏమయ్యోయ్! నాకు సహాయం గానీ చెయ్యడానికి వెనుకబడ్డావా, లేక నాతో జతగా రావాలనుకునిగానీ...!" అని వ్యంగ్యార్థం గుప్పిస్తూ, పకపకనవ్వేవాడు. దాంతో ఆ సోల్జరు సిగ్గుపడి, చకచక అడుగులు వేసి, జట్టువారితో కలుసుకునేవారు.

నిజంగా చాల తమాషా మనిషిగా కన్పించినా, సియా ముఖంలో గంభీరత్వం, ముడివడిన ఆ కనుబొమ్మలు, తీక్ష్ణంగా చూసే లోతైన కనులు... ఏదో పట్టుదల, కార్యాతురతను సూచిస్తుంటయ్!! అతని ముఖం చూస్తూంటే, గత జీవితంలో ఎన్నో కష్టనష్టాలకు, బాధలకీ గురై, ఎన్నో ప్రపంచానుభవాలు కలిగినవాడుగా గోచరించక మానదు!!...

♦ ♦ ♦

ఎర్రసైనికుల పటాలంలో చేరకముందు అతని జీవితగాథ అతివిచిత్రంగా గడిచింది. అతని జీవితపు బండి చక్రాలు గతుకుల రోడ్డులో ఒడిదుడుకులుగా పరుగెట్టి కడకు అతన్నీ స్థితిలోకి తెచ్చాయి!... సియా ముఖస్థంగా అతని జీవితగాథ విని, చాల బాధపడ్డాం ఆ క్షణంలో!

—ఇంతకుపూర్వం సియా ఒక పేదరైతు మాత్రమే!...'లిన్‌వాన్' ప్రాంతంలో ఒక పట్టణపు సరిహద్దు పల్లెలో – తండ్రి, భార్య, యిద్దరు పిల్లలతో సంసారం సాగించాడు. సియా తండ్రి చాల ముసలివాడగుటవల్ల సంసారభారాన్ని పూర్తిగా తానే మోయాల్సివచ్చింది!...

మహాగడ్డురోజులవి!...ఆ రోజుల్లో అతని లాంటి సామాన్యరైతులు ఈతిబాధలకు గురియై, పనులుదొరక్క, నకనకలాడిపొయ్యేవాళ్లు!

1927 సం॥లో గొప్ప ప్రజావిప్లవం చెలరేగింది. దేశంలో ఆ విప్లవాన్ని అణచెయ్యడానికి సేనలను పంపింది చైనా ప్రభుత్వం!...ఆ "క్యోమింటాంగ్ సైనికులు" జట్లుజట్లుగా లియూవాన్ ప్రాంతం గుండా మజలీలు చేసుకుంటూ వెళ్ళిపోయారు. ప్రతి

జట్టు, వచ్చినప్పుడల్లా వూరికే వెళ్ళేవారు గాదు! అధికారగర్వంతో, తాము చేసే నీతిమాలిన పనులవల్ల ఆ ప్రాంతపు ప్రజల్ని వుద్రేకపరచి, రెచ్చగొట్టి మరీ వెళ్ళిపోయేవారు! వాళ్లు గావించే దౌర్జన్యాలకు ప్రజలు ఆవేశంతో, ఆగ్రహంతో, దహించే అవమానంతో వుడికిపోయేవారు. అదీ ఎర్రసైనికుల పటాలపు అభివృద్ధికి ఎంతో దోహదమిచ్చింది!...

1930 సంవత్సరంలో "చియాంగ్-కై-షేక్"-"శత్రువులైన ఎర్రసైనిక పటాలాల్ని మొత్తంగా రూపుమాపండంటూ" తన సైనికుల్ని పంపాడు. "క్వోమింటాంగు సైనికుల"లో నలుబది యారవ దళం అందుకు నియోగింపబడ్డది! వాళ్ళందరూ 'సియా' గ్రామంలో మొట్టమొదటగా మజిలీచేశారు. వారు అధికారగర్వంతో, దౌర్జన్యంతో ఆ ప్రశాంత పల్లెపట్టును క్షణంలో అంధకారబంధురమైన భూలోక నరకంగా మార్చివేశారు!

ఆ కాలంలో 'సియా' వేసిన పంట సరిగ్గా పండలేదు. వారి కుటుంబం ఆర్థికంగా దెబ్బతింది! అయినా "సియా" యిరుగుపొరుగువారి నడిగి, యీసారికి ఎలాగో అప్పుగానైనా కావలసిన ధాన్యాన్ని తెచ్చుకుందామని ఆశతో వూరిలోనికెళ్లాడు. కాళ్ళు అరిగేలా తిరిగేడు.

ఆదినం గూడ చుక్కే ఎదురయింది సియాకు! ఎవ్వడూ దమ్మిడీ అప్పు పెట్టడానికైనా, గిద్దెడు గింజలు యివ్వడానికైనా సమ్మతించలేదు! ఎవరికి వారే...వున్నా, లేకున్నా...లేదులేదన్నారు. తన గ్రహచారానికి విచారిస్తూ, ఆ మిట్టమధ్యాహ్నం మండుటెండలో చెమటలు గక్కుకుంటూ, నిరాశా, నిస్పృహలతో యింటిముఖం పట్టాడు 'సియా'!

గుమ్మంలో కాలిడబోతున్న సమయంలోనుండి భీతావహమైన భార్యకేకలు చెవినిబడ్డాయి! గుండె అదిరిపోయింది సియాకు! పరిస్థితిని అర్థంచేసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు. ఒక్క వురుకున చేతికి దొరికిన కర్రపుచ్చుకుని, పులిలా గర్జిస్తూ, నట్టింట్లో కురికాడు....

—పూర్తిగా తాగి, కైపులోనున్న సైనిక నాయకుడొకడు తన భార్యను బలాత్కరిస్తూండటం కళ్ళబడింది! ఆమె గుడ్డలు పెనుగులాటలో పీలికలయ్యాయి...వారి బారినుండి తప్పించుకోవాలని ఆ మానవతి శతవిధాల ప్రయత్నిస్తూంది. యిదంతా కాబట్టనట్లు సోల్జర్లు తన బిడ్డల్ని నేలపైవేసి, వారిని తమ ఆసనాలుగా వుపయోగించుకుని, ద్రాక్షారసాన్ని ఆస్వాదిస్తున్నారు!...సియా తండ్రి నేలపై చచ్చిపడి వున్నాడు!!...ఇంటినిండా రక్తం! పిల్లల ఆర్తనాదాలు!!...కళ్లు చెదిరిపోయాయి 'సియా'కు! హృదయంలో అగ్నిపర్వతమే బ్రద్దలయింది....

'సియా' కళ్లనుండి ఒక్కసారిగా అగ్నికణాలు రాలాయి...ముఖం ద్వేషంతో కందగడ్డలా మారింది. విపరీతమైన ఆవేశంతో, భరించలేని ఆవేదనతో...కర్ర పైకెత్తి ఆ నాయకుని తలపై ఒక్క పెట్టు పెట్టాడు....అంతే!.. అంతవరకూ వెర్రి ఆశలతో, అందరాని పండునందుకోవాలని, అజ్ఞానంతో అనంతపాపాని కొడిగట్టిన ఆ దుర్మార్గుడు "అమ్మా!" అంటూ నేలబడ్డాడు! ద్రాక్షారసాస్వాదనతో, మైకంలో జోగుతూ, ఆనందపారవశ్యంలో లీనమై పరిసరాలన్నీ మరచిన సైనికులు ఆ అరుపుతో ఉలిక్కిపడ్డారు...ఎదుట దృశ్యంగని కళ్లు తెరుపుడుబడ్డాయి. మరి, ఒక్కక్షణం గూడ ఆలస్యం చేయకుండా, వెన్నంటిన భయంతో, తడబడే అడుగులతో పరుగు తీశారా మూర్ఖులు!!...

'సియా' మాత్రం ఆవేశం విజృంభించగా, కోపంతో సైనిక నాయకునిపైబడి, పిడిగుద్దులతో సత్కరిస్తున్నాడు. ఆ దెబ్బలకి వాడి ఒళ్ళు హూనమైంది!...భరించరాని బాధతో, వెర్రికేకలు వేస్తూ, తప్పించుకోడానికి శక్తిలేక, చేష్టలు దక్కి జీవచ్ఛవంలా, చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా అనుభవించసాగాడు ఆ మహావీరుడు!!...

అలా ఇంట్లోనుండి తప్పించుకెళ్ళిన ఆ ధీరోధాత్తులు మరో పదిమందిని తోడుతెచ్చారు తమ 'ఆఫీసరు'ని రక్షించేందుకు!...ఆఫీసరు వీళ్లని చూడగానే ..వెర్రికేక పెట్టాడు....

"రండి...రక్షించండి! ఈ ద్రోహిని ప్రాణాలతో వదలకండి! వీడు...వీడు పచ్చిదొంగ! ఎర్రసైనికుల కూటమిలోనివాడు..." ఇంకా ఏమేమో అరవబోయాడు. కానీ మరో దెబ్బతో వాడి నోటికి మూతపడింది!...

పదిమంది సైనికులు 'సియా'మీద పడి చావ మోదారు. గాయాలెన్నో తగిలి, రక్తం ఓడుతున్నా, సింహంలా పోరాడాడు 'సియా'! అతనిచే దెబ్బలు తిన్నవారు ఇక సాధ్యంకాక 'రైఫిల్స్' గురిపెట్టారు. మరుక్షణం యిల్లంతా "ధామ్...ధామ్"లతో, అనంతమైన పొగతో నిండిపోయింది! నిస్సహాయంగా

కేకలు పెడుతున్న భార్యాపిల్లల బాధాజనితమైన ఆఖరి అరపులు మాత్రం వినగల్గాడు... స్పృహతప్పి నేలకొరిగిపోయాడు సియా!...

సియాకు నడికేయిన స్పృహవచ్చింది... కళ్లు తెరిచాడు మెల్లగా... ఒళ్లంతా గాయాలతో, నొప్పులతో కొంకర్లుబోతూంది! లేవలేకపోయాడు సియా!... చుట్టూ కళ్లుత్రిప్పి పరిశీలనగా చూశాడు... సైనికులజాడే కనిపించలా... లాంతను పగిలిపోయి, ఆరిపోయిందేమో! చిమ్మచీకటి అలుముకొనివుంది యిల్లంతా!

"పిరికిపందలు! చేతగాక తుపాకులు పేల్చారు!.. అబ్బా!" అంటూ అతికష్టంమీద లేచి, క్రొవ్వొత్తి వెలిగించాడు. ఆ గుడ్డి వెలుగులో యిల్లంతా కలియజూసి, ఒక్కసారిగా బావురుమన్నాడు!...

ముసలితండ్రి, భార్యాపిల్లలు — అందరూ నిర్జీవంగా, నేలను పడివున్నారు! యిల్లంతా రక్తపు మడుగులతో నిండిపోయివుంది. ఆ మడుగులో నిశ్చింతగా, నిర్జీవంగా పడివున్న తనవారిని చూసి, పొరలివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక బిగ్గరగా ఏడ్చాడు సియా!... ఎంతటి ఘోరదృశ్యమది!... ఎలాంటివారికైనా భీతిగొల్పేలా వుందా దృశ్యం!! గుండెలు పగిలిపోయాయి సియాకు! ప్రియమైన అర్ధాంగి, ముద్దొచ్చే పిల్లలు, పితృవాత్సల్యం చూపే తండ్రి... అంతా దూరమయ్యారు. 'ఇక తనకి 'నా' అన్న వారెవరూ లేరు!' భరించరాని దుఃఖంతో, వారిని పేరుపేరునా పిలుస్తూ, ఒళ్ళంతా ప్రేమగా నిమురుస్తూ, పసిపిల్లాడికన్నా హీనంగా ఏడ్చాడు!!...

—ఇల్లంతా సర్వనాశనమైంది... అతని ఆనంద ప్రపంచమే తలక్రిందులయింది. భార్యముందు కూలబడి, విభ్రాంత మనస్కుడై, పొరలివచ్చే దుఃఖంతో పిల్లల మృతదేహాలవేపు చూస్తూండిపోయాడు! అతని హృదయం పూర్తిగా గాయపడింది!

"దీనికంతకూ కారణం ఆ రాక్షసులే గాదూ! యిక యీనాటినుండి వారంతా తనకు ప్రత్యక్ష విరోధులు. వాళ్ల రక్తం కళ్లజూస్తాను... తప్పకుండా వారి నొక్కొక్కరినీ చిత్రవధ చేస్తాను... నా పగ తీర్చుకొంటాను..." అంటూ పళ్లు పటపట కొరికాడు భీకరంగా!!

చేతిలో క్రొవ్వొత్తి ఆఖరుసారిగా ప్రజ్వలించింది!... ఆరిపోబోతున్న దాన్ని వాకిటిముందుకు విసిరేశాడు కోపంగా! టప్పున తలుపుదగ్గర పడిన దాని వెలుగులో అతనికేదో 'తళుక్కు'మని మెరుస్తూ కన్పించింది!... అది క్యూవోమింటాంగ్ సైనికులు ధరించే టోపీ! బహుశ యింతకుముందు జరిగిన పోరాటంలో ఆ ఆఫీసరుగాడిదై యుంటుంది!... దానిపైనున్న ఒక ఇత్తడిరేకు ఆ వెలుగులో ప్రకాశించింది... దానిపై ఆ దేశపు జాతీయచిహ్నం కొట్టొచ్చినట్లుగ కన్పించింది "..."!!...

తెప్పరిల్లి, చటుక్కున దాన్ని చేతికి తీసుకున్నాడు సియా. జాతీయ చిహ్నమున్న ఆ రేకును మాత్రం వూడబెరికి, టోపీని విసురుగా నేలకేసి కొట్టాడు... అంతలోనే మళ్లీ భార్యాపిల్లల్ని చూసి, 'బావురు'మంటూ అనంతశోకంలో పిచ్చివాడిలా అయ్యాడు!

ఇరుగుపొరుగువారల ఓదార్పు మాటలతో కాస్త తేరుకుని, వారి సహాయంతో 'కర్మకాండ'ను యథావిధిగా పూర్తిచేశాడు! దుర్మార్గుల దౌర్జన్యానికి బలియైన ఆ కుటుంబమంతా మట్టిలో కలిసిపోయింది! ఈదుకోమనివున్న ఆ యింట్లో ఒక్కక్షణం గూడ ఒంటరిగా వుండలేకపోయాడు సియా! వూర్లో యింకా తను దుర్వ్యసనాలను నిరాటంకంగా కొనసాగించే ఆ దుర్మార్గుల దుండగాలను చూడనిష్టం లేక, ఇల్లువదలి, ఇష్టమొచ్చిన దారిబట్టి, గమ్యస్థానం లేని బాటసారిలా ఎటో వెళ్ళిపోయాడు! అతని స్థితికి విచారించిన ఆ ప్రజలు, తమస్థితి అంతకు దిగ జారకుండా జాగ్రత్తలు వహింపసాగారు!

◆ ◆ ◆

అలా తిరిగి తిరిగి చివరకు, 'యుంగ్ మింగ్' రెడ్ ఆర్మీలో చేరాడు. — 'ఆర్మీ'లో చేరిన మొదటి దినాల్లో అతనికి అచటి పని చాల కష్టంగా, భారంగా తోచింది. కానీ అందువల్ల తన పగను తీర్చుకునే అవకాశం లభించడంతో మేరలేని ఆనందంతో వుక్కిరి బిక్కిరి అయ్యాడు. తన శత్రువులైన 'క్యూవోమింటాంగ్ సైనికుల్ని' కొందర్ని చంపడంతో — పగతో, అవమానంతో నిలువెల్లా భగభగలాడే అతని హృదయం చల్లబడింది ... అతని మనస్సు వుల్లాసంతోనూ, ఆనందంతోనూ ఓలలాడింది. సంతోషంగా, చిరునవ్వులు చిందిస్తూ, చలాకీగా తిరగటం మొదలుపెట్టాడు! అందరితోనూ చనువుగా ప్రవర్తించసాగడు.

అలాచలాకీగా తిరుగుతూ, పని చేయడంవల్ల ఆఫీసర్ల కందరకీ ఎంతో ప్రీతిపాత్రుడయ్యాడు సియా! త్వరలోనే 'ఆర్మీ'లో ప్రధానవంటవాడ

యాడు. వంట చెయ్యటం తనకు పోటీ లేదనిపించుకొన్నాడు, కొద్ది కాలానికే!

ఎలాంటి పరిస్థితులలోనైనా – మేం యుద్ధం చేస్తున్నా, ఒకేస్థలంలో స్థిరంగా వున్నా, లేకపోయినా సియామాత్రం వేళకు సరిగ్గా భోజనం తయారుచేసి పెట్టేవాడు!

అతని భుజాన ఎప్పుడూ, కావలసిన పాత్రలు, నూనె, వుప్పు, చెంచాలు, తదితర వంటసామాగ్రి అంతా ఓ సంచీలో వుండేవి! అంతబరువు అలాగ్గా మోసుకెళ్లేవాడు సియా! ... నిజం చెప్పాలంటే మాలో ఎవ్వరూ అంతబరువును మోయలేరు! వాటిని అతి జాగరూకతతో చూసుకుంటూ వుండేవాడు.

— నేనతనితో స్నేహం చేసిన విధానం చెప్పాలంటే చాల తమాషాగా వుంటుంది!...

నేనవి ఎర్రసైనికుల పటాలంలో చేరిన - మొదటి రోజులు! సియా అప్పటికే పేరుబడ్డ వంటవాడుగా వున్నాడు, అతను చేసే రుచికరమైన భోజనాన్ని, మేం మరే కూరగాయిలూ, మాంసం వగైరాలక్కర లేకుండానే మింగేసేవాళ్లం. అన్నిటికిమించి అతను వండే ఓ చక్కటి వంటకం ... "క్యవోపా"... మధురాతి మధురంగా వుండేది. అది పరమాన్నం కన్నా, క్షీరాన్నం కన్నా రుచికరంగా వుంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే దాంతో మరేపిండి వంటా సాటిరాదు!! ఆవంటకమంటే పడిచచ్చే వాళ్లం మేమంతా! ... కానీ, సియా దాన్ని ఎక్కువ కష్టపడి పనిచేసి, తన చేత "సెభాష్" అనిపించుకొన్నవారికే ప్రేమంతో మరింత వడ్డించేవాడు!

ఒకనాడు నేనలా వంటగదిలోగుండా వెడుతున్నా... టేబిల్‌పై పళ్లెంలో 'క్యవోపా' ముక్కలు అమృతంలా నాకళ్ళబడింది! నానోట్లోనీళ్లు ఎరుకలేకుండానే ఊరసాగినై ... దాన్ని ముట్టుకోకుండా వుండలేక పోయ్యాను. ఓ ముక్కను మక్కువతో తీసుకుని సరిగ్గానోట్లో వేసుకోబోయే సమయంలో, 'సియా' వూడిపడ్డా డెక్కణ్ణుంచో!

నే చేస్తున్న పనికి దిగ్భ్రాంత డయ్యాడు సియా! కాసేపటికి తెప్పరిల్లి, ... "సాయ్! నేను దాన్ని 'అయో' కోసం వుంచానోయ్... పాపం! అతనింకా పనిలోనుండి తిరిగి రానేలేదు. అది కాస్తా తినేస్తున్నావా?..."

— నేను పట్టుబడ్డ దొంగలా, కుక్కిన పేనులా అయిపోయాను క్షణంసేపు. మారుమాటలేకుండా గబుక్కున బయటికి పరుగుతీసాను! అతడు సగం కోపంతోనూ, సగం చిరునవ్వుతోనూ ... "పూరి కోతివెధవా" అని అనినట్లు జ్ఞాపకం!!

కొద్దిరోజుల తర్వాత ... ఒక నాడు దక్షిణ మాచెంగ్ యుద్ధంలో ఓ క్యవోమింటాంగ్ సైనికుణ్ణి చావుదెబ్బతీసి, అతని రైఫిల్స్'ని లాక్కొచ్చాను. వాడు మాకు ఖైదీ అయ్యాడని వేరే చెప్పక్కర్లేదు!

ఆ రోజు ... "ఒకేయ్ సాయ్! ..." అంటూ ఆప్యాయంగా చేరబిలిచాడు సియా!

"ఏం(...?" చేసిన ఘనకార్యానికి ఆనందంతో పొంగిపోతూ, మాట్లాడాను.

"క్యవోపా కావాలా ...?" ప్రశ్నించాడు సియా.

"నాకోసంగానీ దాచివుంచావా ...?," ఎదురు ప్రశ్న వేశాను.

"పాపం! ఖైదీని పట్టుకుని, అలసిపోయావ్ కదూ! ... మంచి 'రైఫిల్స్' సంపాయించావ్ .. వూ... కూర్చో అలా ..." అంటూ పాకశాలలోకి పరుగుతీసాడు చిన్నపిల్లాడిలా. అతని 'వుత్సాహాన్ని, సంతోషాన్ని చూసి ఆశ్చర్యపడ్డాను. ఇంతలో, ఓ పళ్లెం నిండుగా 'క్యవోపా' ముక్కల్ని పెట్టి, ఓ బేసిన్‌లో వేడివేడి మాంసపుపులుసు తెచ్చి నాముందుంచాడు ... సియా తనే ఖైదీని పట్టుకొన్నంతగా సంతోషసాగరంలో మునిగిపోయి వున్నాడేమిా? 'క్యవోపా' యొక్క సువాసనతో నా నాసికాపుటాలు నిండిపోయాయి. ఎప్పుడెప్పుడు తిందామా అన్నకోరిక నాలో వుర్విళ్లూరుతూంది! నావాలిక ఆలస్యాన్ని సహించక హృదంతో రిపోర్ట్ చేసింది ...

"ఊఁ... !" అన్నాడు సియా. గబగబ తినడం మొదలెట్టాను. సియా 'తనమురళి' తీసి మనోహరంగా వాయించసాగాడు. ఎక్కువ ఆనంద కల్గినపుడెల్ల మురళిని వాయించడం సియాకుఅలవాటు! ... సంతోషంతో ఒక్క నిముషంలో పళ్లెం ఖాళీ చేసాను.

తర్వాత కొంత సేపటికి 'సియా' మృదువుగా ... "సాయ్ ఇది నీ విజయాన్ని పురస్కరించుకుని ఇచ్చినవిందు! నువ్విలాగే శ్రద్ధతో పనిచెయ్యాలి! ఇంకా ఎక్కువమందిని ఖైదు చెయ్యాలి! వాళ్ల ఆయుధాలేగాదు ... ఆరాక్షస ప్రభుత్వాని కూల

దోసి... దేశాన్ని మనచేతుల్లోకి తెచ్చుకోవాలి ... మనదీ ఒక స్వతంత్ర దేశంగా, మనమూ స్వతంత్ర పౌరులుగా బతకాలి! ... పచ్చిదొంగలైన ఈ క్యువోమింటాంగ్ సైనికుల్ని చంపి, వాళ్ళరక్తం త్రాగాలి! ... అప్పుడు గాని 'మన' కసి తీరదు!... మనకు కావలసినంత క్యువోషా ...!" ఆవేశంతో చెప్పుకపోసాగాడు సియా!

ఆ రోజునుండి మేమిద్దరం ప్రాణస్నేహితుల మయ్యాం ... అయితే, ఖర్మకొద్దీ, నేను సియాకు ప్రీతికరమైనపని చెయ్యనిగినాన, నాకు అప్రియమైన వంటకం వాసన చూడటానికైనా లభ్యమయేది గాదు! ...

◆ ◆ ◆

1937 సం॥లో జపాను పెద్దఎత్తున చైనాపై యుద్ధం ప్రకటించింది. దాంతో 'చియాంగ్-కై-షేక్' కమ్యూనిష్టులతో కత్తికలపాల్సి వచ్చింది... యిది సియాన్ సంఘటన జరిగిన తర్వాతే ఎదుర్కొంది మమ్మల్ని! దేశరక్షణకై మాలోమాలో కలహాలెలావున్నా, పైవార్ని అడ్డగించేందుకు తాత్కాలికంగా ఈ రాజీ, రాయభారాలు కొనసాగినై!

అంతకుపూర్వం మా పటాలంలో కొంతభాగం, గొరిల్లాయుద్ధం కొనసాగించడానికి నియమింపబడి వుండినది. యాంగ్‌సీ నదీతీరాన జరిగిన మూడేండ్ల పోరాటం తర్వాత ఆ శాఖ వుపసంహరింపబడింది. కాని, పై పరిణామంతో మరల ఆ సైనికశాఖ తిరిగి ప్రవేశపెట్టపడింది.

ఈ హఠాత్సంఘటనతో మా యూనిఫారమ్, అంతా మారిపోయింది!...కొత్తదుస్తులు యివ్వబడ్డాయి... యింతకాలం అఖండంగా వీర్యాధిక్యతను చాటిన 'ఎర్రచుక్క'తో ఎనిమిది ముఖాలు గలిగివున్న టోపీ తొలగించబడింది. అందుకు బదులుగా మరో టోపి, 'జాతీయ చిహ్నం'తో మిలమిల మెరుస్తూ మాతలలపై ఠీవిని యొనగూర్చింది. యీ విషయంలో ఎవరి ముఖాల్లోనూ సుముఖత్వం, వుత్సాహం పొడసూపలేదు. అవంతైనా ఆనందం కల్గకపోగా విచారం అలుముకొంది!

యింతకాలంగా విరోధులైన క్యువోమింటాంగ్ సైనికులు ధరించే దుస్తులు, టోపీ మేమూ ధరింపవలసి వచ్చినందుకే ఈ అలుకంతా!...సమాలోచనలు, సభలు జరిగాయి...'క్రొత్త యూనిఫారమ్' విషయంలో అలా మార్పులెందుకు చేయాల్సివచ్చిందీ, అందువల్ల తమ కొనగూడే లాభాలు గురించీ మాకంతా వివరంగా విపులీకరించారు అధికార్లు! యుద్ధరంగంలో, మనలో ఐకమత్యాన్ని ఒనగూర్చి, ధైర్యంగా శత్రువులైన జపనీయులను ఎదుర్కొనటానికిలా చేశామనీ, ఆందోళన అనవసరమనీ, దేశభక్తితో అందరూ ముందడుగేయాలనీ, మనలోని స్పర్థలు తాత్కాలికంగానైనా మర్చిపోవాలనీ... ప్రోత్సాహమిచ్చారు. సైనికులు, వీరరక్తం పొంగగా, ఆనందంతో 'జేజే'లు పల్కారు!...

కాని యింతమంది యింత వుత్సాహంగావున్నా, సియా ముఖంలో మాత్రం విచారం, ఆగ్రహం గూడు కట్టుకునివుంది. అతనిలో 'పగ' పొగరగుల్తూనే వుంది! అందరి ముఖాలు కలకలలాడ్తూన్నాయి... ప్రతి ఒక్కరూ పాత 'యూనిఫారమ్' తీసేసి, క్రొత్తవి ధరించి, అందులో తమ రూపాల్ని చూసుకుంటూ మురిసిపోతున్నారు. శత్రువుల్ని జయించినట్లే తలపోసుకుంటూ, దర్పంగా యిటునటు తిరుగుతున్నారు.

కాని... కాని... సియా మనసు మాత్రం విచార సముద్రంలో మునిగిపోయివుంది... అతనీ మార్పుకేమాత్రం సుముఖత్వం చూపలేదు. దుస్తులు మార్చలేదు!...

అగ్నిశిఖలా మెరుస్తోన్న 'ఎర్రచుక్క'తో చూపరులకు భయంకల్గించే ఆ టోపీని తీసివెయ్యలేదు!... ఎంత ధైర్యం, సాహసం!

పాకశాలాధికారి యితని మొండితనం చూచి, ఆగ్రహించి, శాసనం ప్రకారం నడిచితీరాలన్నపుడు గూడ 'సియా' తొణకలేదు.

"క్షమించాలి! నేను ఎర్రసైనికుల పటాలంలోని వాడిని! 'ఎర్రచుక్క' గల యీ టోపిని, ఈ దుస్తుల్ని తప్ప మరోటి ధరించలేను!..." గంభీరంగా, పట్టుదలగా పల్కాడు.

"అరె! పిచ్చివాడా!...యీ క్రొత్త యూనిఫారం ధరించడంలో తప్పేముందనీ! ఏమిటా పిచ్చిపట్టుదల...మన అధికార్లు చెప్పలేదూ...యిదంతా మనలో ఐకమత్యం కోసమేనని...యిప్పుడు మనలో మనం అంతఃకలహాల మాట మర్చిపోవాలోయ్!... జపాన్‌వాళ్ళతో అటో యిటో తేల్చుకున్నాక, చూద్దాం." ఎంతగా నచ్చచెప్పినా 'సియా' వినక

(137వ పేజీ చూడుడు)

# స్వీకారం

"రాఘవ"

(గతసంచిక తరువాయి)

తన్ను అదే పనిగా చూడలేక నేమో, ముఖం ప్రక్కకి తిప్పుకున్నాడు. ఏదో బాధ రమణమూర్తిని పరీక్షిస్తోందని గ్రహించింది. యింకా బాగా చూసింది చాటుకి తిప్పుకున్న ముఖంవంక 'తను కాంక్షించిన ఆనందం కల్గేటట్లు లేదు' – అని నిర్ధారణ చేసుకొంది. విముఖత్వంతో పాటు విచారమూ ఏర్పడింది. జీవితంమీద ఆశవుడికిపోయింది. వుత్సాహం హృదయంలో యింకిపోయింది. అంతే ... కోరికలు తలెత్తి రమణమూర్తిని చూడలేకపోయినయి. తనవల్ల యేదో అవమానం రమణమూర్తి పట్ల నటిస్తోందనుకొంది. తనలో యే ఆకర్షణా కనిపించలేదేమో! నని కన్నీరు పెట్టుకొంది ... కాని రమణమూర్తికి మళ్లా అంతలోకే, 'సావిత్రీ!' అని పిల్చి పలకరిద్దామనిపించింది. మరింతదగ్గరగా వచ్చి, రెండుచేతుల్లోకి తన ముఖాన్ని తీసుకొని, మధురంగా చూస్తూ కన్నీరు కార్చాడు. తాను వివశురాలై అతని హృదయంలో దాక్కుందామని వొరిగింది. యిద్దరిమధ్యా యింత వరకూ మాటల్లేకుండాపోయినయి.

రమణమూర్తికి, తన సరోజనేత్రాలలో తీర్చుకోవలసిన వాంఛలు ఎన్నో కనిపిస్తున్నట్లుగా వున్నయి. అనుభవించటానికి వీలుగా ఆనందం హృదయంలో నిండివుంది. యవ్వనమధువులో స్వర్గానుభూతుల్ని కల్పించుకోవచ్చు .. దానికి వీలైనమార్గాలు కనబడుతున్నాయి ప్రత్యక్షంగా. ఏకొరతలేకుండా వుండొచ్చు అని అతనిచూపుల్లోని అర్థం... తను చివరకెలాగో గ్రహించగల్గినందుకు తృప్తిగా ఆశ్లేషించింది. ఇలా మిగతా రెండురాత్రులూ అసంతృప్తిగా గడిచిపోయినయి" .........

అప్పట్నుంచి సావిత్రిలో, యీ నాటివరకూ ఆనందం అనేపదానికి అర్థం, అసంపూర్తిగానూ - అసంతృప్తిగానూ వుంటూవస్తోంది ... రమణమూర్తి చర్యలు వింతగా కనిపించటంతో, "యేదోరహస్యం వుంది. లేకపోతే యెందుకిలా ప్రవరిస్తారు ?" అని ఒక మూఢమైన అనుమానాన్ని కల్పించుకొంది.

మురారి మీదవున్న మనసుని మార్చుకోగల్గినందుకు, చివరకు సావిత్రికి, రమణమూర్తివల్ల నిరాశా – నిస్పృహాలు కల్గినయి... తల్లిదండ్రులతో పాటు—చేసుకొన్న భర్తకూడా మోసంచేసాడని ధృవపర్చుకొంది. అయినా, యింకా యేదో ఆశ రమణమూర్తి పట్ల పాకులాడుతూనే వుంది – ఆశ్రయాన్ని కోరుతూనే వుంది.

మరో రెండునెలలు గడిచినయి. రమణమూర్తిలో దాగివున్న రహస్యంయేమిటో క్షుణ్ణంగా తెలుసుకొని తీరాలని సావిత్రి సర్వవిధాలా కృషిచేయసాగింది. యెప్పటికప్పుడు సావిత్రిని చూసినప్పుడల్లా, రమణమూర్తి యెంతో జాగ్రత్తగా ప్రవర్తించటం మొదలెట్టాడు. యెక్కడ తనరహస్యం బట్టబయలు అవుతుందో అని, ముక్తసరిగా మాట్టాడటం నేర్చుకున్నాడు. యెంతసేపూ తన ఆఫీసుపనీ, ఆ పుస్తకాలూ – యీ పుస్తకాలూ చదువుకోటమేగానీ. సావిత్రితో సరదగా – కులాసాగా – సంభాషించటం లేకుండా పోయింది. అన్నంతిన్నంతసేపూ సావిత్రి అనేక విధాలుగా పలకరించి చూసేది – ఆకుమడిచి యిస్తూండేది ... బూట్లుపాలిష్ చేసిపెట్టి, 'బాగున్నాయా ?' అని అడిగేది. రమణమూర్తి, అన్నిటిని మౌనంగా స్వీకరించి, తనదారిన తను, ఎటో వెళ్లిపోయేవాడు...

రమణమూర్తి తల్లికూడా, కొడుకువిషయంలో యేమీ హెచ్చరించేదిగాదు. ఫలానా పనిచేసుకొని రమ్మనమని కోరేదిగాదు. యెంతసేపూ తనజబ్బుని గురించి తానువాపోతూ, 'చచ్చిపోతే బాగుండును. ఎంతకాలం యీ విధంగా మంచంలోపడి తీసుకొంటూ వుండను?' – అని పరితపించటమే సరిపోయేది. ఇక

తన బాధనెలా వ్యక్తపరుస్తుంది అత్తగారికి? అక్కడికీ సావిత్రి, ఒకటి రెండుసార్లు, తన భర్తనిగురించి ప్రశ్నిస్తూ - "ఎన్ని సార్లు పిల్చినా పల్కటంలేదు. అథవాపల్కితే, తిరిగి విన్నమాటకి జవాబివ్వరు... అదోలా యెప్పుడూ వుంటున్నారు. పరాయివాడికన్నా హీనంగా నా వంకచూస్తున్నారు ... ఒక మాటా మంతీయేమీలేదు ... మౌనంగా యిలా యెందుకుంటున్నారో నాకర్థంకావటంలేదు...ఒకవేళ నావల్ల యేదైనా తప్పుజరిగితే మిమ్మల్నిద్దరినీ క్షమించమని కోరుతున్నాను ... ఎంతకాలం చూసినా, వారు నావంకకురావడానికి వుపేక్షిస్తున్నారు? ఎందుకో తెలియకుండావుంది? కాపురానికొచ్చి నాల్గునెలలూ దాటుతూవున్న కమ్మగా నోరు విప్పికలుపుగోలుతనంగా మాట్లాడిన రోజులేదు... యిలా యిక నాజీవితం ఎడారి పూవులాగా అయిపోవాల్సిందేనా అత్తయ్యగారూ? ... యిలా యెంత కాలమని అడివిగాచిన వెన్నెలలాగా బ్రతకను" - అని కంటనీరెట్టుకొని గాద్గదికంగా అంది.

'రమణమూర్తి తల్లికి, కోడలిలా చెప్పుకొని వచ్చేసరికి, కొడుకుని తల్చుకుంటూ - "బంగారు బొమ్మలాంటి పిల్లని యిలా యేడిపిస్తావనుకోలేదురా! కట్నంకోసం, పెద్దనాన్న మాటవిని దాని గొంతిక కోసావురా!... పాపిష్ఠివాడా! నా కడుపున చెడ పుట్టావు...ఉన్న ఆస్తిని దూబరాగా చదువుకొంటూవున్నాననేమిషతో తగలేసావ్ ... ఒళ్లుపాడుచేసుకొన్నావ్...యింతవరకూ దాన్ని సుఖపెడుతున్నావనుకున్నాను. యీగదిలో దిక్కులేకుండా పడివుండబట్టేగా యిలా ప్రవర్తిస్తున్నావ్? ఆడపిల్లని అన్యాయంగా యేడిపించి, వూసూరుమనిపిస్తున్నావా? కర్మకాలి నాకు కళ్లుకూడాలేకుండా పోయినయి మసూచికం మూలాన. దానికి తోడుచెముడొచ్చింది. చావనీయకుండా బ్రతికిస్తోంది యీ వుబ్బసం ... యిన్నింటి మూలానేగా మీరెలావున్నారో తెలుసుకోలేకపోతున్నది!"-అని తెరలు తెరలుగా వస్తున్నదగ్గుని ఆపుకొంటూ — తమాయించికొంటూ వణుకుతూ అంది...

సావిత్రి, వెంటనే ఆ సమయంలో భర్త యొక్క యథార్థజీవితాన్ని వినేసరికి విభ్రాంతురాలైంది... 'ఒళ్లు పాడుచేసుకున్నావ్'-అని తల్లి అన్నదంటే, ఏదో ఒక విపరీదార్థం అందులో యిమిడివుందని యిట్టేగ్రహించుకొంది. అందువల్లనే కాబోలుభర్త' తనంటే దూరదూరంగా వైదొలగి పోతూన్నాడని తెలుసుకొంది...'రమణమూర్తి ... కాదు తన భర్త ...అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకొన్నవాడు...దైవంతో సమానుడు ... చివరకు యిలాంటివాడా!'_అని సావిత్రి దిగ్భ్రమతో ముప్పిరిగొంది. ఒక్కసారిగా హృదయం వులిక్కిపడింది....సహజంగా భర్తపట్ల భార్య కుండవలసినభావాలన్నీ తారుమారైనయి... అయినా సాధ్యమైనంతవరకు తన మనస్సుని సంబాళించుకొని-మిగతావివరాలకోసం నిరీక్షించటం మొదలెట్టింది ... గృహనిర్వాహణత్వంలో యథారీతిగా — యే మార్పుకల్గనీయకుండాచూస్తూ, నడుచుకోసాగింది ... సంఘాన్ని దృష్టిలో పెట్టుకొని ... వ్యక్తుల్నిగమనిస్తూ. ఒక నెలగడిచింది ... రమణమూర్తిలో యే మార్పురాలేదు ... ఇక రాదని, సావిత్రి మనస్ఫూర్తిగా నమ్మేసింది. పరిస్థితులు మునుపటికంటేకూడా విషమించినయి. తనకిక యీ యింటిలో_యీ భర్తతో కాపురంచేయటం కుదరదని నిశ్చయించుకొంది. అయినా, లోకంకోసం, మంచి రోజులు వచ్చేంతవరకూ మర్యాదగానిల్చివుండటం అన్ని విధాలా శ్రేయస్కరమనిపించి, ఆ వేదనల్ని — అభిప్రాయాల్ని - ఆకాంక్షల్ని అణగద్రొక్కుతుంది. జీవచ్ఛంలా బ్రతకటంకంటే వేరే తరుణోపాయం ఏమీకనిపించలేదు...

అలాంటి విషమ పరిస్థితుల్లో సీతాపతి, కాంతమ్మ ప్రోద్బలంతో సావిత్రిని దసరాకి తీసుకొని వెళ్లటానికివచ్చాడు. తండ్రిని చూసేసరికి ద్వేషం_పగ_రోషం ముంచుకొచ్చాయి సావిత్రికి. కానీ, కన్నతండ్రి అవటంవల్ల, వాటన్నింటిని అణగార్చుకొని, యోగక్షేమాలు - ముఖ్యంగా తల్లిని గురించీ _ అడిగి తెలిసికొంది. కాని, కంటనీరు పెట్టుకొని, తెలివి తక్కువ దానిలా, తన ప్రారబ్ధాన్ని తల్చుకొంటూ_ ప్రస్తుతం తన సంసారంలోని విషమ స్థితిగతుల్ని గురించి యిసుమంతైనా చెప్పబూనలేదు. ఒక్క మాటతో 'అంతా కులాసా' _ అని మాత్రం చెప్పి వూరుకొంది. 'రమణమూర్తి ఏడీ?' అని అడిగాడు. "వస్తారు. వేళైందిగా!" - అంది మాటవరసకి. ఇంతలో రమణమూర్తి యెక్కణ్ణుంచో వచ్చాడు. అప్పటికి యింటిముఖం చూసి రెండు రోజులైంది. యెక్కడ ఎంగిలిపడ్డాడో ఎవరికి తెలియదు. ఎక్కడున్నాడో యీ రెండురోజులూ అంతకన్నా తెలియదు. మొత్తానికి ఎలాగో వచ్చాడు. సీతాపతి,

వెంటనే రమణమూర్తిని పల్కరించి, తనెందుకొచ్చిందీ చెప్పాడు. మళ్లా యెప్పుడైనా వెళ్ళిపోతాడేమోనని తరువాత మామా, అల్లుడూ కాసేపు కుశలప్రశ్నలతో కాలక్షేపం చేసారు. మహావుంటే ఒక గంటో – గంటన్నరో వున్నాడు. అంతే. వెంటనే లేచి, 'వసుందండీ! మామయ్యగారూ! వెళ్ళొస్తా' – అంటూ గుమ్మం దాటబోతూండగా— "మరి అమ్మాయిని యీరోజు సాయంత్రమే తీసుకు వెడదామనుకుంటున్నాను. మీరూ తప్పకుండా బయలుదేరాలి" అన్నాడు సీతాపతి. రమణమూర్తి ఆపాళాన వెనక్కితిరిగి – "నిరభ్యంతరంగా తీసుకెళ్ళండి. నేను మాత్రం యిప్పట్లో రావటానికి తీరికలేదు. మరోసారి వీలు చూసుకొని వస్తాను. యీ సారికి దాన్ని తీసుకెళ్ళండి" – అని, జేబులోంచి ఒక యిరవై రూపాయలు తీసిచ్చాడు సావిత్రికి. మౌనంగా అందుకొని, చెకిలిగా తనలో తాను చిరునవ్వు నవ్వుకొంది. "వెధవడబ్బు. దీని మూలంగానే నా జీవితం సర్వనాశనమైంది" అని మనస్సులో అనుకొని, ప్రయాణానికి సిద్ధం కాసాగింది. సీతాపతి రిక్షా తేవడానికి వెళ్లాడు. అత్తగారికి కూడా, 'తనిలా దసరాకి వెడుతున్నా' నని చెప్పి, పెట్టెకు తాళం వేసింది సావిత్రి. అత్తగారు, సావిత్రిని దీవిస్తూ, "నీకైనా నామీద దయ వున్నది. వాడు యిక నా మొగం చూడడు. నువ్వెళ్లిపోతే, గుక్కెడు మంచినీళ్లు యిచ్చేవాళ్లు కూడా వుండరు. మళ్లా యెన్నాళ్లకొస్తావో యేమో, అంతవరకు బ్రతికివుంటానో, వుండనో, యిందా! యీ యాభై రూపాయిలూ దగ్గరుంచుకొని క్షేమంగా వెళ్ళిరా" అని కన్నీరు పెట్టుకొంది. సావిత్రికి అత్తగారి మాటలు అన్నీ వినేసరికి, "తను గనుక లేకపోతే తల్లిముఖం కూడా చూడరన్నమాట" అని బాధగా అనుకొంది.

"తనంటే పోనీ యిష్టంలేదని తెలుస్తూనేవుంది, కాని కన్నతల్లిమీద యెందుకింత కినుక. ఆమెగారేం కష్టం కల్గించింది. నవమాసాలు మోసి, చదువు చెప్పించి, జాగ్రత్తగా కన్నుల్లో వొత్తులు వేసుకొని పెంచి, పెద్దవాణ్ణిగా చేసినందుకా! యీనాడు ఆవిడగార్కి కొడుకువల్ల యింత మనోవ్యాధి. ఛీ... తన భర్త యిలాంటివాడవుతాడని యెన్నడూ కలలో గూడా తల్చుకోలేదు" అని సావిత్రి, రమణమూర్తి పట్ల యేహ్యభావాన్ని – యేవగింపును కల్గించుకొంటూండగా గుమ్మం ముందుకు సీతాపతి వెంటబెట్టుకొచ్చిన రిక్షావచ్చి ఆగింది. వెడుతూ, వెడుతూ సావిత్రి అత్తగారికి మరొక్కమారు నమస్కరించి, యింటి తాళంచెవులు, భర్త పెట్టెల తాలూకు తాళంచెవులు – "వాడొస్తే యివ్వండి" అనిచెప్పి మెట్లు దిగబోతూండగా "వాణ్ణిగురించి నువ్వేమీ మనస్సులో కష్టపెట్టుకోకు సావిత్రీ! యెన్నాళ్ళో వుండవు యీ చెడురోజులు. నా ముఖం చూసైనా వాణ్ణి క్షమించు. అపార్థం చేసుకొని, అనవుసరంగా ఆవేదనపడకు. వెళ్ళగానే వుత్తరం వ్రాయి" అని అత్తగారు చెప్పి సావిత్రిని సక్రమంగా సాగనంపింది. రిక్షా కదిలింది స్టేషనువైపుకి. యింకా బండి రాలేదు.

ఇరువురూ ప్లాటుఫారంమీద కూర్చొన్నారు. మైక్ లో యింకా బండి రావటానికి ఒక పావుగంట ఆలస్యం వుందని ప్రకటనద్వారా వినబడింది.

సీతాపతి, స్తబ్ధుడై కూర్చోటంవల్ల, సావిత్రికేం తోచకుండా వుంది. ఏమైనా, కబుర్లు చెప్పకుండా మనిపించి –

"అమ్మ కులాసాగా వుందా?" అని ప్రశ్నించింది. సీతాపతి ముక్తసరిగా "ఆఁ" అన్నాడు.

"బామ్మ యేమంటోంది" అన్నది మళ్లా. "రోజూ నిన్ను – మీ ఆయన్ను తల్చుకొంటూ వుంది" అన్నాడు యెద్దేవాగా. సావిత్రి మనస్సు చివుక్కుమంది. వెంటనే తండ్రి ముఖంవంక చూసింది. యేదో చిక్కుసమస్యను గూర్చి ఆలోచిస్తున్నట్టుగా వున్నాడు.

"ఏమిటి నాన్నా! అంతదీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అన్నది దీనంగా. పల్కలేదు. సీతాపతి నిజంగా ఆలోచిస్తూనే వున్నాడు వియ్యపురాలి మాటల్ని నెమరువేస్తూ. వచ్చేటప్పుడు కూడా వాణ్ణి గురించి నువ్వేమీ మనస్సులో కష్టపెట్టుకోకు. యెన్నాళ్ళో వుండవు చెడురోజులు. నా ముఖం చూసైనా వాణ్ణి క్షమించు. అపార్థం చేసుకోకు. అనవుసరంగా ఆవేదనపడకు." యిలా తన కొడుకుని గురించి, సావిత్రికి చెప్పింది. యీవిధంగా అత్తగారు సావిత్రికి యెందుకు చెప్పింది? కారణం యేమిటీ? యేదో అంతరార్థం దాగివుండకపోతే, ఆ మాటలలా చెప్పబడవు. సావిత్రి కేదో అన్యాయం జరిగింది. రమణమూర్తి సావిత్రిని యేదో చిక్కులో పడేసి యేడిపిస్తున్నాడన్నమాట. అదే ఏమిటని?"

సీతాపతికి బొత్తిగా అర్థంకాలేదు. పోనీ కన్న కూతుర్ని అడిగి తెలుసుకుందామా! అనుకున్నాడు. చెప్పుతుందో చెప్పదో అని అంతలోనే అనుమానించాడు. తీరా అడిగితే సావిత్రి కంటనీరు పెట్టుకుంటూ – "మీ మూలంగానే నా జీవితం యిలా తయారైంది. పరాయివాడికిచ్చి నా గొంతుకోశారు. యింకా సిగ్గులేక యేమని నా భర్తని గురించీ, నా సంసారాన్ని గురించి చెప్పుకుంటాను. ఒకవేళ చెపుతాను. మీరై యేమైనా తీర్చగలరా? అలాంటప్పుడు దేనికీ? చెప్పటం" అని నిర్మొహమాటంగా అంటూ తేలికపరుస్తుందేమోనని సంశయించి వెనక్కి తగ్గాడు.

ఎంతసేపటికీ తండ్రి, అడిగిన ప్రశ్నకి సమాధానం యివ్వకపోయేసరికి సావిత్రికి యిక మాట్లాడాలనిపించలేదు. రైలు యెప్పుడు వస్తుందా? యెలా ఎక్కుతామా? యెప్పటికి పోతామా? అని పదేపదే అనుకొంటూండగా, వంపు తిరుగుతూ స్టేషనులోకి వస్తున్న ప్యాసింజరు కూత హఠాత్తుగా వినిపించింది. తల తిప్పిచూస్తూ – "నాన్నా! రైలు వస్తోంది" అంది. సీతాపతి వెంటనే కూలీని పిల్చి, పెట్టెవున్న రెండు బుట్టల్ని రైల్లో పెట్టమని చెప్పాడు. సామానుతోపాటు సావిత్రి కూడా యెక్కి కూర్చుంది. సీతాపతి మాత్రం ప్లాటుఫారంమీద, పరిచయస్థులెవరో కనిపించి పల్కరిస్తే మాట్లాడుతూ నిల్చున్నాడు. బండి కదలటానికి యింకా యింజను నీళ్లు పోసుకొని రాలేదు. అంటే యింకా కొద్ది నిముషాలపాటు ఆలస్యమవుతుందనుకొంది సావిత్రి. యీలోపుగా కూర్చున్న దగ్గరనుంచి రమణమూర్తిని తల్చుకొంటూ, దిగులుపడసాగింది. అత్తగార్ని అష్టకష్టాలుపెట్టే తనభర్త యిలాంటివాడని తెలుస్తుంటే మా అమ్మవైపువారు యెంతగా తన్ను హీనపరుస్తారో అని విచారపడసాగింది. కిటికీగుండా ప్లాటుఫారం మీదవున్న జనాన్ని యథాలాపంగా చూస్తుండగా తనతండ్రి – మురారితో మాట్లాడుతూ నిలబడి వుండటాన్ని చూసి నివ్వెఱపోయింది. "మురారి ప్రేమించిన బావ – పెళ్ళి చేసుకొని సుఖిద్దామనుకొన్న మురారి బావ – అవును అతనే. యింకా యిప్పుడు తన తండ్రితో యేమిటో ప్రస్తావిస్తున్నాడూ? అంతా అయిన తరువాత యింకా మాట్లాడడానికేముందని? యింతసేపు మాట్లాడుతూ నిలబడివున్నారూ? బహుశా! తన్ను గురించి ముచ్చటిస్తున్నాడేమో మరి! ఛా...ఛా...యిక యీ లోకంలో సావిత్రిని గూర్చి తల్చేవారూ – అనుకునేవారూ – కలగనేవారూ ఒక్క మా అమ్మ పార్వతి తప్ప మరెవ్వరూ లేరు. ఉంటే మా అత్తగారు. అంతే!" అని తనకు తాను ఓదార్చుకొంది రెండవ తరగతి పెట్టెలో ఒంటరిగా.

ఇంతలో యింజను వచ్చి బండిని కదిపి, ముందుకు మెల్లిగా లాగి, మామూలు ధోరణిలో పోవటం ప్రారంభించింది. సీతాపతి, మురారి యిద్దరూ విడిపోకుండానే వచ్చి తన పెట్టెలో యెక్కి కూర్చున్నారు. సీతాపతి సావిత్రి పక్కగా చతికిలపడ్డాడు. మురారి యూనీఫారంతో సావిత్రికి యెదురుగా కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. సావిత్రి కిటికీగుండా ముఖంపెట్టి వెనక్కిపోతున్న ప్రకృతిని విసుగ్గా చూస్తూవుంది. ముగ్గురూ మూడు రకాలైన వుద్దేశ్యాలతో సతమతమవుతున్నారు. యెవరు ముందు సావిత్రిని పల్కరించాలో – సీతాపతికిగాని, మురారిగానీ అంతుపట్టలేదు. రైలు మాత్రం గర్భిణీ స్త్రీ నడక మాదిరిగా నడుస్తోంది.

అరగంట నడిచింది. అంతవరకూ అలముకొన్న మూగనిశ్శబ్దాన్ని యెవరూ చీల్చలేదు. యెవరికి వారు యేమీ పట్టనట్టుగా వుండిపోయారు. యిలా ఎంతసేపు కాలక్షేపంచేసి గమ్యస్థానానికి చేరాలో ఎవరికి వారు ఆలోచించుకోసాగారు. కొంతసేపటికి, సావిత్రి తల మురారివైపుకు తిప్పి –

"గుర్తున్నానా బావా?" అంది. సీతాపతి వినిపించుకోనట్లు నటించాడు.

"యిప్పటికి గుర్తొచ్చానన్నమాట... ఏం సావిత్రీ! అవునా?" అన్నాడు మురారి.

ఇలాంటి సమయంలో తాను మధ్యవర్తిత్వం వహించటం అంత శ్రేయస్కరం కాదనుకొని, సీతాపతి 'యిప్పుడే వస్తానంటూ' లేచి, మంగళగిరి స్టేషన్‌లో రైలు ఆగీఆగటంతోనే దిగి వెళ్ళిపోయాడు. మళ్ళీ రైలు కదిలింది. సీతాపతి యీ వెళ్ళిపోవటంతోనే, సావిత్రి ఒక్క వెకిలినవ్వు నవ్వి వూరుకొని, మురారివంక దీనంగా చూసి, కన్నీరు పెట్టుకొంది. మురారికి ఆశ్చర్యం వేసింది.

(సశేషము)




# ఆశాలత

యాజ్ఞవల్క్య శ్రీ

వాస్తవిక జగత్తులో తీరనికోర్కెలు స్వప్నలోకంలో తేరి హృదయానికి కొంత సంతృప్తినిస్తాయి. కలలు కనడం మానవులకు అవసరం.

'ననుపాలింపగ నడచి వచ్చితివో' అని మా పక్కింటి అమ్మాయి సరళ, హార్మోనియం వాయిస్తూ వాయిస్తూ పాడుతుంటే చిన్నతనంనుంచీ జరిగిన సంఘటనలూ, మధుర స్మృతులూ ఒకదాని వెనుకగా నొకటి జ్ఞాపకానికి రాసాగేయి! చల్లని పిల్లగాలి కమ్మని క్రొంగొత్త పూపరిమళాన్ని అందిస్తుంటే వాలు కుర్చీలో కూర్చుని ఆస్వాదిస్తూ, ఆమత్తులో ఏవేవో కోర్కెలుదయిస్తుండగా, అర్ధనిమీలిత నేత్రాలతో ఆనంద సాగరంలో కొట్టుక పోతూ, మధ్యలో సుడిగుండంలాగ నా చిన్ననాటి విచార సంఘటనలు తామరతంపరగా వెలువడి మనస్సుని బాధపెడుతున్నాయ్! ఆ అనుభవాలను మనస్సులోనుంచి తప్పించడానికి ప్రయత్నించ సాగేను. దానికి పిండారబోసినట్లుకాస్తున్న శరద్రాత్రి వెన్నెలలు, ప్రకృతికి తెల్లని వెల్లివేసి మనోహరంగా చిత్రించినయ్! శతశ్చంద్రుడు తన చల్లని కిరణజాలములను, మాకిటికీగుండా లోనికి ప్రసరింపజేసి శరీరమునకొక నూతనోద్రేకమును కలిగిస్తున్నాడు.

కన్నులు విప్పి ఆ దిక్కు నిదానంగా పరీక్షించేను. ఆ వెన్నెల వెల్లలో సరళ, మునుపటి సరళకాదు! రోజూలేని క్రొత్త కళ, సౌంధర్యం, అనాడామెలో మూర్తీభవించి ఉన్నాయ్! అంత సేపూ మూసి ఉంచి అప్పుడే తెరిచేనేమో కొంచెం మసక మసకగానున్న కళ్లు, సరళను చూడగానే చిన్ననాటి నా ఆశాలతను జ్ఞాపకానికి తెచ్చేయి!

నేను అప్పుడే కాలేజీ ఆవరణలోకాలు పెట్టేను. ఆశాలత మాయింటి ప్రక్కనే ఉన్న గణేష్‌గారి కుమార్తె. మా నాన్నగారూ, గణేష్‌గారూ చిన్ననాటినుండీ స్నేహితులు. అందుచేత మా రెండు కుటుంబాలూ, సుహృద్భావంతో నుండేవి. ఆ కారణంచేత నాకూ ఆశాలతకూ సన్నిహితత్వం యేర్పడింది! ఆశాలత తల్లి చిన్నతనంలోనే పోయింది. గణేష్‌గారు ఆశాలత మీది గారాబం చేత మరో వివాహం తలపెట్టకుండా, ఆశాలతనే తన సర్వస్వంగా చూచుకుంటూ జీవితయాత్ర సాగిస్తున్నారు! ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ఆశాలతను మా యింట్లో దిగవిడిచేవారు!

ఆశాలతా నేనూ ఎన్నెన్నో ఆటలు ఆడుకుంటూ ఉండేవారిము!

జరుగుతున్న కాలం కంటే జరిగిపోయిన కాలమే మేలనిపిస్తుంది. చిన్నప్పటి మా స్నేహబీజం మొలకెత్తి మా వయస్సులతో పాటు పెరుగుతూ, మాలో యవ్వన ఛాయలు పొడచూపగానే పూలుపూచి, పిందెకట్టి, ముదిరి ప్రేమబీజంగా మారింది! యవనచ్ఛాయ లంకురించగానే, ఆశాలత నడవడికలో మార్పు గోచరించింది. చనవుగా మాట్లాడేదికాదు! కాని ముందు కంటే ఎక్కువ ప్రేమనొలికించే కళ్ళతో మౌనంగా మాట్లాడుతుండేది! ఆ కళ్ళు అద్దంలాగ ఆమె మనస్సులోని భావాలన్నింటిని ప్రతిబింబింపజేసేవి! ఆ కళ్ళలోని భావాలు గాలితో కలసివచ్చి, నా హృదయ తంత్రులను తాకి మనస్సును ఏ స్వర్గవీధుల్లోనో విహరింపజేయగల్గిన మధుర రసమయ గీతాలను ఆలాపింపజేసేవి!

నా కళ్ళు ఆమె కళ్ళు కలియగానే, ఆమె తల అప్రయత్నంగా క్రిందికి సిగ్గునొలికిస్తూ దిగుతుండేది. ఆమెలో సిగ్గు అధికమౌతున్నకొలదీ, నాలోని తియ్యని కోరికలు కూడా చెలరేగుతుండేవి! ఆశాలతకూ నాకూ మధ్య ఆశాలత అల్లుకుపోయింది. మా హృదయాలు ఆశాలతతో బంధింపబడ్డాయి! ఆశాలత ఒకనాడు కన్పించకపోతే వాళ్ళింటికి వెళ్ళి చూస్తేనే గాని మనసు కుదటపడేదికాదు! నేను వెళ్ళకపోతే ఆశాలతే ఏదో పనిపెట్టుకుని మా యింటికి వచ్చేది! మా అమ్మ వంటింట్లో పనిచేసుకుంటుంటే వచ్చిన ఆశాలత తిన్నగా 'అత్తయ్యా, అత్తయ్యా' అని పిలుస్తూ నా రూమ్‌లోకి వచ్చేది! నన్ను చూడటానికి వచ్చినట్లు అనిపిస్తే చిన్నతనమని కాబోసు!

ఆశాలతంటే మా అమ్మగార్కి కూడా ఎంతో అభిమానం, ప్రేమ ఉన్నాయ్! ఆమెను నాకు వివాహం చెయ్యాలనే కుతూహలం కూడా ఉన్నాది! ఒకనాడు గణేష్‌గారు ఆశాలతను వెంటబెట్టుకుని వచ్చారు! నా రూములో నేను చదువుకుంటున్నాను! ఆశాలత వస్తూనే తన అలవాటు ప్రకారం తన కళ్ళను నా రూములోకి పంపించింది! నా కళ్ళూ ఆమె దర్శనం కోసమే నిరీక్షిస్తున్నాయేమో, అటు ప్రసరించాయి! ఇద్దరి కళ్ళూ కలియగానే, ఆమె కళ్ళు క్రిందికి వాలాయి! కళ్ళే ఆకర్షణ! కళ్ళ సోయగమే స్త్రీకందం! కళ్ళ చలనమే పురుషుడిని కట్టిపడవేస్తుంది!

గణేష్‌గారు అర్జంటుగా పనిమీద బొంబాయి వెళ్తున్నట్టు, పదిరోజుల వరకూ రానట్టు, అంతవరకు ఆశాలతను మా యింట్లో వదలి వెళ్ళడానికి నిశ్చయించినట్టూ మా అమ్మతో చెప్పారు.

"అలాగే వెళ్ళిరండి అన్నయ్యగారూ! 'ఆశ'కు నేనంటే భయభక్తులున్నాయ్! లేకపోయినా ఇకముందునుంచీ మా యింట్లో మెసలవలసిన పిల్లేగదా!" అన్న మా అమ్మ మాటలకి నేనే లోకంలో విహరించానో చెప్పలేను!

"ఆశను జాగ్రత్తగా చూడండి" అని పదేపదే చెప్పి టాక్సీ ఎక్కారు గణేష్ గారు!

చదువుతున్నట్టు పుస్తకాన్ని ముఖానికి

అడ్డంగాపెట్టి, వాళ్ల సంభాషణలను వింటూ, ఆశాలత అందాన్ని రెండుకళ్లతో జుర్రేస్తున్నాను! ఆ రోజు ఆశాలత ముఖం రోజూకంటె ముఖం అందం చిందుతూ కళ కళలాడుతున్నది!

''భోజనానికి లేవరా'' అన్న మా అమ్మగారి మాటలకు ఉలిక్కిపడ్డాను. మా అమ్మ వంటింట్లోకి వెళ్ళింది. నేను బట్టలు మార్చుకుంటున్నాను. ఇంతలో తలుపు దగ్గర గాజులు గలగలలాడాయి. విననట్టు ఊరుకున్నాను. మెల్లగా లోనికి వచ్చింది! యీ రోజునుంచీ నేనిక్కడే ఉంటాను అన్నట్లు నవ్వుపువ్వుల్ని వెదజల్లుతున్నది ఆమె ముఖం!

'అత్తయ్యా, అత్తయ్యా' అంటూ నా రూమ్‌కి వచ్చే అలవాటు తప్పించావేం? చిలిపిగా ప్రశ్నించాను.

'పోదూ!' అంటూ మెల్లిగా వెళ్ళి పోతున్నది!

'వెళ్లిపోతుంది కాబోలు! నాకేం తోచలేదు! చట్టున చెయ్యిపట్టుకుని నిల బెట్టాను! చెయ్యి విడిపించుకుని 'అత్త య్యతో చెప్పనా' అంటూ నన్ను బెది రించింది.

అంతపని చెయ్యకుగాని నువ్వొచ్చిన పనేమిటి?

చెప్తే, ఏం బహుమానం ఇస్తావ్ ఎదురు ప్రశ్న వేసింది. అంతవరకూ దృష్టిని క్రిందికి దించి కాలి బొటనవ్రేలితో నేలను రాస్తు న్నది. చేతితో గడ్డం పట్టుకుని పైకెత్తి కళ్లల్లోకి చూస్తూ 'ప్రేమ బహుమానం కావాలా?' అన్నాను. చెయ్యి విదలించు కుని 'అత్తయ్యతో చెప్పనా' అంటూ లోనికి పరుగెత్తింది!

నేనే చిలిపిపని చేసినా ఆశ 'అత్త య్యతో చెప్పనా' అని బెదిరించడం, నేను 'తాపీగా చెప్పవచ్చునులే' అనడం పరి పాటైపోయింది! గణేశంగారు వచ్చి ఆశను తీసుకపోయారు!

నేను పై చదువుకి మద్రాసు వెళ్ళాను. కొన్నాళ్ళవరకూ ఆశ మీది నా ఆశ పాశమై మనస్సును అటువైపే లాగేది! తర్వాత అక్కడి వాతావరణానికి అలవాటు పడ్డాను. కొన్నాళ్ళపాటు ఆశ యోగ క్షేమాలను మా వాళ్లు రాస్తుండేవాళ్లు. కాని ఏ కారణంచేతనో క్రమంగా రాయడం మానేశారు! కాలేజీకి సెలవులు ఇచ్చారు. మెయిలు ఎక్కాను. దాని గమనం నా మనోవేగానికి యీసు కాలేకపోతు న్నది.

అంతులేని ఆలోచనలు ఆశను గురించి వేస్తున్నాయ్! నా ఆశ యీ పాటికి పెద్దదై పోయి ఉంటుంది! నన్ను గుర్తుపట్టగలదా? సిగ్గు మునుపటిలాగే ఉందో? తగ్గిందో? ఆ చిలిపికళ్లు నన్ను గిలిగింతలు పెడ తాయా? ఆ చెంపకు చారడేసి కళ్ళూ - సుదీర్ఘమైన ఫాలభాగం - తేనెలొలికే పెదవీద్వయం-నువ్వుపువ్వులాంటి ముక్కు - నిగనిగలాడే వక్షం - ఆహాహా! మరువ గలనా! నా ఆశ ఇంకా బాగుంటుంది! ఆశ నా జీవితానికొక వెన్నెలబాట!

ఆలోచనా తరంగ పరంపరలలో ఎంతో దూరం కొట్టుకొనిపోయి, తిరిగి

వచ్చానేగాని, మెయిలు మాత్రం తాబేలు నడకలు సాగిస్తూనే ఉంది!

నాన్నగారు చదువును గురించి ప్రశ్నలు వేస్తున్నా విన్పించుకోకుండా అమ్మగారి వద్దకు వెళ్ళి 'ఆశాలత ఎక్కడ?' అని పశ్నించాను. 'ఎక్కడుంటుంది? అత్త వారింటి దగ్గర' అని నిరాశగా అన్న మా అమ్మ మాటలకు గుండె ఆగినంత పన యింది!

నిరాశా అనుమానాలతో 'నిజమేనా?' అని రెట్టించాను. మా అమ్మగారు 'నిజమే! కులాసాగానే కాపురం చేస్తున్నది' అన్నారు! ఏ విషయాలు అడగడానికీ మనస్కరించక తిన్నగా బీచికి పోయి నిర్జనప్రదేశంలో నడుము వాల్చాను.

ఆశాలత! నా ఆశాలత! ఏదీ నా ఆశాలత? ఆశారేఖలతో నన్ను ఆకాశ గమనం చేయించిన ఆశాలత యేదీ? ఆ నాటి మా యిద్దరి మధ్యా అల్లుకున్న ప్రేమ లత యేదీ? నవ్వించి, కవ్వించి హృద యాన్ని నాట్యమాడించే నా ఆశాలత యేదీ? విచారం, నిస్పృహ మిళితమైన ఒక చిన్న చిరునవ్వు అప్రయత్నంగా వచ్చింది!

అంత నిర్జనప్రదేశంలోనూ అడుగుల చప్పుడు, ఆ వెనక భాస్కర్ అనే పిలువూ వినిపించి 'ఎవరా యని' చూచాను. ఇంకెవరు? ఎవరినయితే నా ఆశాజ్యోతి, నా ప్రేమజ్యోతి అని భావించుకుని కుమిలి పోతున్నానో, ఆ ఆశాలతే! నాముందు సాక్షాత్కరించింది. భర్తతో బీచికి షికారు వచ్చింది! ఆమె భర్త నాతో చదువుకున్న కామేశ్వరరావు! అలా నిర్ఘాంతపోయి చూస్తావేం బ్రదర్! చిన్ననాటినుంచీ నీతో ఆడుకునే ఆశాలతే! అని భుజం తట్టుతూ అన్నాడు కామేశ్వరరావు.

చిన్నతనంనుంచీ ఆడుకునే ఆశాలత అన్నమాటేగాని, నా ఆశాజ్యోతి, నా ప్రేమసౌధం, నా జీవితరేఖ అని పాప మతనికేం తెలుసును?

వీడు నా స్నేహితుడా? నా ప్రేమ పాశాలను తెగ్గోసిన పాపి! నా ప్రేమ ధనాన్ని దొంగిలించిన గజదొంగ! నా ప్రేమసౌధానికి నిప్పంటించిన క్రూరుడు! మనసు పరిపరివిధాల పోతున్నది!

జాగ్రదావస్థలోకి వచ్చి 'ఆశా! కులా సాగా ఉన్నావా?' అని లేని ఆవేశాన్ని తెచ్చుకుని అన్నాను. ఆ...అన్నమాట తప్ప మరొకమాట రాలేదు ఆమె నోటంట! కళ్లలో విషాదరేఖలు గోచరిస్తున్నాయ్!

'భాస్కర్! పిక్చరుకి పోదాం వస్తావా?' అన్న కామేశానికి 'థాంక్స్' చెప్పి నేను ప్రయాణబడలికతో నున్నాను. మీరు వెళ్ళండి! అనిచెప్పి తప్పుకున్నాను! ఆశా, కామేశాలు వెళ్ళిపోయారు! ఆశగా అటు ప్రక్కే చూస్తూ ఉండిపోయాను.

'జీవితమే ఒక చింతలగంతా' అనే సినీమా సాంగు రేడియో బుంగ రేచ్చిన కంఠంతో ఆలాపిస్తున్నది! ఇక్కడుంటే జీవితంలోని యింకే సంఘటనలు జ్ఞాపకం వస్తాయోనని లేచాను!

నిర్జీవప్రతిమలాగ లేచినిరాశ నిస్పృహా పూరితమైన వేడినిట్టూర్పు నిగుడిస్తూ,

'ఆశాలతా! ఆశాలతా! అని ఆక్రందిస్తూ మొదలు నరికిన చెట్టులాగ నేలకొరిగాను!

అప్పుడే కాఫీ తెస్తున్న నా ఆశాజ్యోతి సరళ తట్టిలేపి, 'అదేమిటండీ! ఆశాలతా! ఆశాలతా! అంటూ మంచం మీాదనుంచి దొర్లేరు' అని కిలకిల నవ్వుతుంటే తెలివి వచ్చింది! ముఖం కడుక్కొని కాఫీ త్రాగుతుంటే 'కల వచ్చిందా' అని ప్రశ్నించింది సరళ!

'నీకు సవతిని తెద్దామని ప్రయత్నించాను. కాని దైవం కథను తారుమారు చేశాడు!' అని కల వివరాలన్నీ చెప్తే, విన్న సరళ నవ్వలేక వంటింట్లోకి పోయింది! కూర్చుని ఆలోచించాను.

రెండు గంటల సినిమాల్లో నెలలు, సంవత్సరాలు కాలగర్భంలో కలసిపోయినట్లు చూపిస్తారు! నా చిన్ననాటి ఆశాలతతో ఆటలు, చదువు, ప్రేమకలాపాలూ, విషాదాలూ మొదలైన నా యిరువది సంవత్సరముల జీవితం అనే సినిమా కలను నడిపించి డైరక్టుచేసిన డైరక్టరు ఎంత గొప్పవాడో కదా సంతోషం, విషాదం, ఆశ్చర్యం మొదలైన అన్ని రసాలూ, యీనాటి ఏ యాక్టరు ఒప్పించలేని ఫక్కీలో, నన్ను హీరోగా నటింపజేసిన ఆ డైరక్టరు ఎవరో కదా!

కామేశం, నేనూ కలసి చదువుకున్నాం! ప్రాణస్నేహితులం! కామేశం, కామేశం భార్య, నేను, అప్పుడప్పుడు మా సరళ, కలసి సినిమాకు వెళ్ళటం అలవాటు! కామేశం భార్య ఆశాలత! ఆశాలత అందమైన యువతి! గొప్ప నిగ్రహశక్తి ఉన్నవాడైతేనేమోగాని, అందంగా కన్పించే వస్తువుకోసం అర్రులు చాచడం సహజం కదా! ఆశాలత అందం నన్ను ముగ్ధుడిని చేసిందనడంలో సందేహంలేదు! ఆశలను బైటపెట్టలేక లోపలే జీర్ణింప జేసుకుంటున్నాను! నిన్ననే ముగ్గురం కలసి సినిమాకి వెళ్ళివచ్చాం! రాత్రి ఒంటిగంటకి వచ్చి ఆశాలతను తల్చుకుంటూనే పడుకున్నాను. తీరనికోరికలు కలరూపంగా వచ్చి మనస్సుకి కొంత శాంతి సంతృప్తి నిస్తాయి! నా కోరిక యీ కలరూపంలో వచ్చింది! యీ కల విషయం, మా కామేశానికీ, ఆశాలతకూ తెలిస్తే ఎంత బాధపడతారు? తెలిసినా నామీాద కోపపడరుగాని, నా మనోదౌర్బల్యానికి నవ్వుకుంటారు! అంతే!

# వెలుగు - నీడలు

శ్రీ వి. ఆర్. భూసారపు

పాత్రలు :

విశ్వం : వయస్సు 22. శిథిలహృదయుడు.

ఆనంద్ : వయస్సు 22. విశ్వం స్నేహితుడు. తనుపట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అనే స్వభావం.

కామేశం : వయస్సు 25. రోడ్డుప్రక్క రోమియో.

కాలాంతకరావు : వయస్సు 25. ప్రపంచంలో అనుభవం సంపాదించిన వ్యక్తి.

(సమయం సాయంత్రం 5 గంటలు)

[ఒక రేక్‌లో పుస్తకాలు అమర్చబడి వుంటాయ్. ఒక Round table మీద సిగరెట్ ఆష్ట్రే వుంటుంది. రెండు లేక మూడు కుర్చీలు. తెర లేచేసరికి విశ్వం అటు, యిటు పచార్లుచేస్తూ వుంటాడు. రేక్‌లోనుండి ఒక పుస్తకం బయటకు తీసి రెండు మూడు పేజీలు తిరగవేసి చిరాకుగా పుస్తకాన్ని టేబుల్ మీద పారవేస్తాడు. "సార్ పోస్ట్" అనే కేక వినబడుతుంది. విశ్వం బయటకు వెళ్ళి వుత్తరం తీసుకొని ప్రవేశిస్తాడు.]

విశ్వం:—విశ్వం! (కవరు విప్పి చదువుతాడు.)

పరిస్థితులన్నీ ఒక్కసారిగా మనమీద విరుచుకు పడ్డాయి! మన యిరువురి హృదయాలు ఏనాడో ఏకమయినాయని ఎన్నో పగటికలలు కన్నాం. చిగునవ్వులతో మన జీవితాలు చిగురించి ప్రకృతిని పరిహసించే పక్షుల్లాగా ఎగిరిపోదామని వూహాడోలికల్లో తేలిపోయాం. నా జీవితం ఎండిన మోడుగా మారింది. మా నాన్న మన వివాహవిషయం సంప్రదించడానికి మీ యింటికి వెళ్ళాడు. ధనం, కులం, అంతస్థు, ఆస్తి, గౌరవం అనే పంచభూతాలు మీ నాన్న హృదయాన్ని రేకెత్తించి, మా నాన్న మనస్సును గాయపరచినాయి. నిరాశతో నిండిన హృదయంతో మా నాన్న యింటిముఖం పెట్టాడు. ఏవిధంగానైనా తన కూతుర్ని ఒక ధనవంతునికిచ్చి వివాహంచేసి చూసి సంతోషించాలని మా నాన్న మనస్సాసించింది! రామాపురంలో నలభై ఎకరాల ఆస్థిపరుడైన రెండవ వివాహం వానికిచ్చి తను తృప్తిపొందాడు! నా వివాహం జరిగి యిప్పటికి మూడు రోజులైంది! ఈ కాలచక్రంలో మనలాంటి అభాగ్యులు ఎంతోమంది నలిగి చస్తున్నారు. నా జీవితంలో ఆశలన్నీ పేకమేడలుగా కూలిపోయాయ్! ఈ మాధురిని యిక మర్చిపో! నేను బ్రతికివున్నానని తెలిస్తే నీ పెళ్ళికి ఒక శుభలేఖ తప్పకుండా పంపించు! శలవు.

ఇట్లు,

మాధురి.

(కవరు ముడిచి టేబుల్ మీద పారవేస్తాడు)

విశ్వం:—మాధురీ! మాధురీ! (బాధగా) నీ జీవితాని కెంతో ద్రోహంచేసాను. కులం, ధనం, అంతస్థు, గౌరవం అనే యినుపరథ చక్రాల క్రింద ఎన్ని జీవితాలు నలిగిపోతున్నాయి మాధురీ!

(కుర్చీలో కూర్చుని టేబుల్ మీద తల ఆనిస్తాడు.)

[కామేశం ప్రవేశం. బొమ్మల బుష్‌కోటు. ఫ్రెంచి కటింగు మీసాలు. వెనక్కి దువ్విన జుట్టు.]

కామేశం:—ఆహా! నా రాణి! నా హృదయరాణి! కుసుమ కోమలి! స్త్రీ జాతి శిరోమణి! కలహంసగామిని! Oh! My dear darling! I

love you too much! You love me how much!

(వినలేక విశ్వం లోపలికి పోతాడు.)

ప్రేమ అనే పదానికి అర్థం తెలియదు యీ బ్రూటుకి. (రేక్ లోవున్న పుస్తకాలలో ఒక పుస్తకంలో నుండి ఫొటో బయటకుతీసి టేబుల్ మీద పెట్టి చూస్తూ)

అందచందాల ఓ! జాబిలీ!
చేరరావే చెలీ నా దరికి!
నా మదీ! దోచి నా రాణివై

(ఆనంద్ ప్రవేశం. షర్టు, పేంటూ వేసుకుని వుంటాడు.)

ఆనంద్:-ఏమిట్రా యీ రోజు చాలా హుషారుగా వున్నావ్! ప్రేమగీతాలు కూడా పాడుతున్నావ్! అసలు సంగతేమిటి?

కామేశం:-ఆ! ఆ! ఏమిటనుకున్నావ్! మన పని హైలాపచ్చీస్. పవిత్రప్రేమ గట్లు తెంచుకొని ప్రవహిస్తుంది! ఒకానొక యువతిని ప్రేమించానురా!

ఆనంద్:-యువతిని ప్రేమించావా! యువతి అమ్మమ్మనేమో అనుకున్నానులే! గంట్లు కొట్టిన తిరగలిలా మొఖమూ నువ్వూను,

కామేశం:-నా మధురస్వప్నాలు పాడుచెయ్యకురా! ఆకాశాన్నంటే నా వంటి స్తంభపు ఆకాసౌధంలో ఏకాంతంగా ఆమె నివసిస్తుంది.

ఆనంద్:-పాపం ఖర్మకాలిపోయింది.

కామేశం:-ఎవరికి రా!

ఆనంద్:-ఆ యిల్లాలికి!

కామేశం:-ఏం!

ఆనంద్:-ఆ! ఏమీలేదు. నీ నిష్కళంకమైన ప్రేమ ఆమె మనస్ఫూర్తిగా అర్థం చేసుకున్నదా లేక నీ సుందరవదనారవిందాన్ని చూచి మన్మథుడని మోహించిందా! అని.

కామేశం:-నిష్కళంకమైన మా ప్రేమకు అందచందాలతోను, రూపురేఖలతోను పనిలేదురా!

ఆనంద్:-వీడు love ని research చేసినట్లు మాట్లాడుతున్నాడు. ఇదంతా ఏ పుస్తకములోనైనా బట్టీపట్టి నాకు అప్పగిస్తున్నావా? చెప్పురా బట్టీ సాయనా!

కామేశం:-ప్రేమసంగతి నీకేం తెలుసురా! మూర్ఖుడా! ప్రేమ అనేది పరులకు కనిపించకుండా నా హృదయంలో Himalayan mountains కన్నా ఎత్తుగా పెరిగిపోయింది. కావాలంటే నా గుండె తుండెలుగా కోసి చూడరా! నీకే అర్థమవుతుంది. శైలామజ్నూల కన్నా అమితమైన ప్రేమ! అనార్కలీ, సలీంల ప్రేమకన్నా మధురమైన ప్రేమ! దేవదాసు, పార్వతి ప్రేమకన్నా గాఢమైన ప్రేమరా మాది. కావాలంటే నా గుండెలు కోసి చూడరా! నీకే అర్థమవుతుంది!

ఆనంద్:-ఎందుకురా కోసి చూడటం. ఖూనీ నేరం నా నెత్తిన మోపి, పోలీసు వాళ్ళు నన్ను మూసెయ్యడానికా వద్దులే బాబూ!

కామేశం:-మా ప్రేమగాథ ఏమిటనుకున్నావ్! ప్రపంచ చరిత్రలో లతా-కామేశంల పవిత్రప్రేమ గాథ సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందిరా!

ఆనంద్:-ఆ అమ్మాయి పేరేమిటన్నావ్?

కామేశం:-My darling's name is కుమారి లతాదేవి!

ఆనంద్:-ల...తా... దే...వి...

కామేశం:-Yes! brother లతాదేవి! చూశావా! పేరు చెప్పేసరికే మూర్ఛ వచ్చినంత పనయింది! ఇక మనిషిని చూశావంటే అలాగే బిగిసిపోతావ్. ఆ పరిసరప్రాంతాల్లో నీళ్ళుకూడా దొరకవ్! మొఖాన్ని జల్లడానికి!

ఆనంద్:-(కామేశం చేతిలోవున్న ఫొటో లాక్కుని చూస్తాడు) ఈ ఫొటో నీకెలా వచ్చింది.

కామేశం:-లతాదేవి నాకు సంతోషంగా Presen చేసింది.

ఆనంద్:-(ఆశ్చర్యంగా) ఆఁ! అలాగా (ఒకనిముషంసేపు ఆలోచించి) అలాగయితే ఒకపని చేస్తావా!

కామేశం:-ఏమిటది! చెప్పు! తప్పకుండా చేస్తాను!

ఆనంద్:-నేను చెప్పినట్లుగా నువ్వు వుత్తరం వ్రాయాలి!

కామేశం:-అమ్మబాబోయ్!

ఆనంద్:-అంతేకాదు! ఆ వుత్తరానికి సమాధానం కూడా తీసుకురావాలి. తెలిసిందా! (నెమ్మదిగా)

నీ నిష్కళంకమైన ప్రేమ ఋజువు చేసుకోవడానికి ఇదొక చక్కని మార్గం.

కామేశం:–(ధైర్యంగా) అలాగే! చెప్పు వ్రాస్తాను! (కాగితం, పెన్ను తెచ్చుకుంటాడు.)

ఆనంద్:–ఊఁ! మొదలుపెట్టు! My dear Lata నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను! నీవు నన్ను ప్రేమిస్తున్నావా! లేదా! ఏ సంగతి వెంటనే నాకు వ్రాసి పంపవలయును.

ఇట్లు,
కామేశం.

కామేశం:–ఒకవేళ సమాధానం తీసుకురాలేక పోతే...

ఆనంద్:–నీవన్నీ లేతసారకాయ కోతలని పూర్తిగా నమ్మేస్తాం.

కామేశం:–ఆ! అంతేనంటావా!

ఆనంద్:–అంతేకాకపోతే యింకేంతనుకున్నావ్! వెళ్లు. (భయంగా వెళ్తాడు) విశ్వం! విశ్వం!

(విశ్వం ప్రవేశం)

విశ్వం:–(మాట్లాడడు.)

ఆనంద్:–ఏం విశ్వం అలా వున్నావ్!

విశ్వం:–(బాధగా) ఆనంద్! ఒక అమాయకురాలి జీవితాన్ని నాశనంచేశాను. నా జన్మకిక పుట్టగతులుండవు. నావంటి పరమ కిరాతకుడెవ్వడూ వుండడు.

ఆనంద్:–అసలు కథేమిటి! వారంరోజుల నుండీ నువ్వు ఎంచేత కాలేజీకి రావడంలేదు. అసలు ఏం జరిగింది చెప్పరా!

విశ్వం:–ఆరు రోజుల క్రితం మా నాన్నగారి దగ్గర నుండి ఈ త్తరం వచ్చింది.

ఆనంద్:-ఏమిటా వుత్తరం?

విశ్వం:–ఏముంది! నువ్వు మాధురి యింటికి వెళ్ళి మీ అమ్మాయిని ప్రేమించాను, వివాహం చేసుకుంటాను అని వాగ్దానం చేశావట. నీవే గనుక ఈవిధంగా చేసినట్లయితే మన వంశగౌరవం ఏమైపోతుంది. నీ తమ్ముళ్ళకు, చెల్లెళ్ళకు మంచి సంబంధాలు వస్తాయా! తక్కువకులంలో పుట్టిన ఒక పేదరాలికి మన యింట్లో స్థానం యిచ్చినట్లయితే మనకు సంఘంలో స్థానముంటుందా. నీ ప్రయత్నాన్ని మాననియెడల నా ఆస్థిలో చిల్లిగవ్వ కూడ నీకు దక్కకుండ చేస్తాను.

ఆనంద్:-దానికి నువ్వేమని సమాధానం యిచ్చావ్!

విశ్వం:–నేనేం సమాధానం వ్రాయలేదు.

ఆనంద్:–మరి యిప్పుడేం కొంప మునిగింది.

విశ్వం:–ఈ వుత్తరం చదువు (చేతి కందిస్తాడు). (ఆనంద్ ఆ వుత్తరాన్ని చదివి నిట్టూర్చి టేబుల్ మీద పెట్తాడు.)

ఆనంద్:–జాబు అందగానే వెళ్ళి మీ నాన్నగార్కి నచ్చచెప్పడానికి ప్రయత్నించవలసింది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ఏం ప్రయోజనం. మాధురి వివాహం జరిగిపోయింది.

విశ్వం:–నన్నేం చెయ్యమంటావ్ ఆనంద్!

ఆనంద్:–కూటికి తక్కువ వాళ్ళయినా కులానికి మాత్రం వాళ్ళు తక్కువవారు కాదుగా! మీ అంతస్థుకు మా అంతస్థుకు సరిపోదు. నీవు అంతస్థు తక్కువవాడివి అనగానే ఆయనకు ఆవేశం ముంచుకొచ్చింది. 'నేనేం తక్కువవాణ్ణా' అని 40 ఎకరాల ఆస్థిపరుణ్ణి చూసి వివాహం చేసాడు. సమయం మించిపోయింది. బాధపడినందువలన ప్రయోజనములేదు. చేతికందిన అదృష్టాన్ని అవకాశంకోసం ఎదురుచూసి ఒక అభాగ్యురాలి జీవితాన్ని నాశనం చేశావ్! క్షణికోద్రేకానికి లోనై వాళ్ళ నాన్న కాటికి కాళ్ళు చాచుకున్న ఒక ముసలి ముక్కుకు కట్టి ఆమె జీవితాశయాలను నాశనంచేసాడు.

విశ్వం:-మా నాన్నగారిది చాలా సున్నితమైన హృదయం అనుకున్నాను. కాని యింతటి పాషాణంగా మారిపోతుందనుకోలేదు.

ఆనంద్:-ఖద్దరు లాల్చీలు, ఖద్దరు పంచెలూ కట్టుకొని దేశనాయకులమని స్వంతడబ్బా వాయించుకుంటే సరిపోతుందా! మొన్న హైస్కూలు వార్షికోత్సవాలలో ఆపకుండా అనర్గళంగా అరగంట సేపు లెక్చరు కొట్టాడుగా వర్ణాంతర వివాహాల మీద, వర్ణాంతర వివాహ విధానం మనదేశంలో ప్రతి ఒక పౌరుడూ ఆచరణలో పెట్టినట్లయితే కొంతకాలానికి మనదేశంలో వర్ణవ్యవస్థ అనేదే కనిపించదని ఆదర్శాలు వల్లించాడుగా! ఈ

రోజున ఆ ఆశయాలు, ఆదర్శాలు తన విషయంలో పనికిరాకుండా చేసుకున్నాడే! నేను ఈరోజునే మనవూరు వెళ్ళి ఆయన పరువు నడివీధిలో పెట్టివస్తాను.

విశ్వం:—అందువల్ల ప్రయోజనమేముంది. విడిపోయిన రెండు జీవితాలు ఏకం చెయ్యగలవా! వాడి నేలరాలిన పుష్పాలు వికసించి తిరిగి కొమ్మను చేరుకోవు ఆనంద్! అంధకారబంధురమైన నా జీవితానికి మీరెవ్వరూ కళాకాంతులు ప్రసాదించలేరు. నా జీవితంలో కారుమేఘాలు క్రమ్ముకున్నాయ్! ఇక నేను ఈ ప్రపంచంలో జీవచ్ఛవంలా బ్రతకలేను. నీ చేత్తోనే కొంత విషం యిచ్చి పుణ్యంకట్టుకో! ఆ పవిత్రమూర్తి మాధురి నన్ను క్షమిస్తుందంటావా ఆనంద్!

ఆనంద్:—విచారించినందువలన ప్రయోజనం లేదు. (టైము చూసుకుని) ఓ! భోజనానికి వేళయింది. (కాలాంతకరావు ప్రవేశిస్తాడు. విలువైన దుస్తులు వేసుకుంటాడు. ముక్కుకు సూటిగా నడిచే స్వభావంగల వ్యక్తి.)

కాలం:—Hallo my dear విశ్వం! ఏమిటలా వున్నావ్! ఏమిటి బ్రదర్ మన హీరో అలా వున్నాడే! హీరోయిన్‌చేత మోసం చేయబడ్డ వాడిలా! (ఆనంద్‌ని చూసి) ఈ ప్రపంచమంతా మధ్య. నువ్వు మిధ్య, నేను మిధ్య. మధ్య మన కెందుకులే! ఈ ప్రపంచమనే దుఃఖాల పుట్టలో మనం కేవలం నిమిత్తమాత్రులం. మనం చేసే ప్రతిపని మనం చేస్తున్నాం అనుకుంటున్నాం. కాని అదే కేవలం భ్రమురా నాయనలారా! అవన్నీ భగవంతుని లీలావినోదాలురా పిచ్చి తండ్రీ.

ఆనంద్:—కాలం! దయచేసి నోరు మూసుకుంటావా ఆ పనికూస్తా నన్నే చెయ్యమంటావా!

కాలం:—నీవు వట్టి అజ్ఞానివి. అంధకారబంధురమైన ఈ కష్టాల పుట్టలో నీకు తెలియనున్న విజ్ఞానమున్న. నే చెప్పినా నీ బుర్రనే బురదగుంటకు అర్థంకాదురా.

ఆనంద్:—ఏడిశావులే! విశ్వం నే భోజనానికి వెళ్ళి అయిదు నిముషాల్లో వస్తా (ఆనంద్ నిష్క్రమణ).

కాలం:—ఏమిటి బ్రదర్ జీవితంలో విచారమనే క్రొత్తపేజీలు ఎప్పటినుండి open చేసావ్! విచారసాగరమనే పుస్తకం వారం రోజులనుండి వ్రాస్తున్నావ్! ఎంతవరకు పూర్తయింది. ఇది ఏ మినిష్టర్‌కి అంకితం చేద్దామనుకుంటున్నావ్! అసలు గాధేమిట్రా!

(విశ్వం కవరు అందిస్తాడు. కాలాంతకరావు చదివి వికటంగా నవ్వుతాడు. విశ్వం ఆశ్చర్యంగా చూస్తాడు.)

కాలం:—ఈ మాత్రం చిన్న విషయానికి మనస్సు పాడుచేసుకోమని ఎవరు చెప్పారు బ్రదర్. నీకు ఈ లోకంలో అనుభవం తక్కువని నీ ముఖం చూసిన ప్రతి చిన్నవాడికి అర్థమౌతుంది. ఈ మాత్రం దానికి యిలా అయిపోతే ఎలా. నా జీవితంలో యిటువంటి చిన్నచిన్న గడ్డుసమస్యలు చాలా వచ్చాయి. మొదట్లో చాలా యిబ్బందిగా వుండేది. తరువాత మనయోగం ఎలావుంటే అలా జరిగిందని విధిని నిందించుకొనేవాణ్ణి. తరువాత తరచుగా యిటువంటి సమస్యలు ఏర్పడుతూ వుంటే అలవాటే గదా అని అనుభవిస్తూ కూర్చున్నాను.

విశ్వం:—కాలం! నీ వేదాంతాలు నా బుర్రకెక్కవు. నువ్విక దయచేయడం మంచిది.

కాలం:—విశ్వం! మనం సమవయస్కులమైనా ప్రపంచంలో అనుభవం నీకన్నా నాకెక్కువ వుంది. ఆదిలో నా అంత దరిద్రుడు లేడు. నా అంతటి దురదృష్టవంతుడు యీ ప్రపంచంలో వల వేసినా దొరకలేడు. నాకు చదువుకోవాలనే అభిలాష మెండుగా వుండేది. నీవంటి స్నేహితుల దగ్గరకు వెళ్ళి చదువుకుంటాను డబ్బు ఏమైనా సహాయం చెయ్యండి అర్థిస్తే అసహ్యించుకొని అవతలకు గెంటేశారు. అనేక విధాలాలోచించాను. నీవంటి శ్రీమంతుణ్ణి వకణ్ణి దృష్టిలో పెట్టుకున్నాను. సమయంకోసం ఎదురుచూసాను. నీవు యింద్రుడవు, చంద్రుడవు అని అరగంట సేపు గాలి కొట్టేసరికి అరడుగుల మనిషి అవగింజంతై నా చేతిలోనికి వచ్చాడు. అతను College student అయినా విలాసపురుషుడు. ఒక మానవునిలో ఎన్ని దుర్వ్యసనాలు వుంటే అంత త్వరగా నాశనమౌతాడో అతనిలో అన్నీ మూర్తీభవించాయి. మనస్సును తెలిసికున్నాను. అతనికి అనుగుణ్యంగా ప్రవర్తించాను. అతనికి లోటులేకుండా బ్రాందీ సీసాలు సప్లయిచేశాను.

విశ్వం:_నీ స్వార్థం కోసం మరియొకని జీవితం నాశనం చెయ్యడం మంచిపనా ?

కాలం:_విశ్వం! ఈ రోజులలో వంచించయినా, మంచితనంతో నయినా యితరుల ఆధారంలేకుండా తన బ్రతుకు తను బ్రతకగలగాలి. మీతోనే Intermediate వరకు చదివాను. పరీక్షలకు డబ్బు కట్టేశక్తి నాదగ్గర లేకపోయింది. ఈ మద్రాసులో కొంచెం ముఖం పరిచయమున్న వ్యక్తి దగ్గరకు వెళ్ళి ఆదరించమని అర్థించాను. కష్టపడటానికి శరీరముంది. కష్టపడి జీవించమని కసిరికొట్టి బయటకు నెట్టారు. మీరందరూ పరీక్షల్లో కూర్చున్నారు. రేయింబవళ్ళు తెగఏడ్చాను. కాని ఏం ప్రయోజనం. ఆ సంవత్సరం పరీక్షలలో కూర్చోలేకపోయాను. తరువాత జీవితంమీద విరక్తి కలిగింది. విషంత్రాగి చచ్చిపోదామని తుదినిర్ణయం చేసుకున్నాను. నీవంటి మిత్రుడొకడు నాకు జ్ఞానోదయం కలిగించాడు. ముక్కుకు సూటిగా నడిచేవాడికి ఈ లోకంలో స్థానంలేదు. కష్టపడటానికి శరీరమున్నా పనియిచ్చే మహానుభావుడెవ్వరూ కన్పించలేదు నాకారోజుల్లో. తరువాత కొంతకాల మాలోచించి చిన్న క్లబ్బు ఒకటి open చేసాను. శ్రీమంతులతో స్నేహం సంపాయించాను. రెండు సంవత్సరాల వ్యవధిలో నా పని మూడు పువ్వులు ఆరు కాయలగా మారింది. క్లబ్బువల్ల పెద్దపెద్ద ఆఫీసర్లతో స్నేహం లభించింది. ఈరోజున నాకున్న గౌరవం రెండు సంవత్సరాల క్రితం నేను కనిపిస్తే యీసడించుకొనే ప్రతివాడు నా దారికి అడ్డుతొలగి నమస్కారం చేస్తున్నాడు.

విశ్వం:-కాలం! నిన్నింతవరకు సామాన్య స్నేహితునిగానే చూస్తున్నాను గాని యింత అనుభవం సంపాయించిన మహోత్తర పురుషుడవనుకోలేదు. ఇప్పుడు నన్నేం చేయమంటావ్ కాలం!

కాలం:_ముందు నీ మనస్సుకు కొంత విశ్రాంతి కావాలి. నాతో రా చెప్తాను.

విశ్వం:_ఎందుకు! ఎక్కడికి నన్నిక్కడే వుండనియ్యి! నా మనస్సేమీ బాగుండలేదు.

కాలం:-కాదు బ్రదర్ నాతో రా! చెప్తాను.

(బలవంతంగా లాక్కుపోతాడు)

(ఒక నిముషం నిశ్శబ్దం. అనంతరం ఆనంద్ ప్రవేశించి అటుయిటు చూస్తాడు. రేగిన జుట్టుతో కామేశం కంగారుగా ప్రవేశిస్తాడు.)

ఆనంద్:_కామేశం! విశ్వం కనిపించాడా!

కామేశం:-కనిపించాడు. ఆ కాలంగాడితో కలసి వెళ్తున్నాడు. ఎక్కడికి వెళ్తున్నావురా అని నేను ప్రశ్నించినా సమాధానం చెప్పకుండా పోతున్నాడు.

ఆనంద్:_కాలంగాడితోనే వెళ్తున్నాడా! సరే కానీ ఏం జరుగుతుందో చూద్దాం. అదిసరే నీ జుట్టు అంతా అలా రేగిపోయిందేరా!

కామేశం:-జుట్టు రేగడానికేంగాని గొప్ప నాటక మాడాను బ్రదర్. ఒక Great adventure చేసాననుకో! ఎంత కష్టపడ్డాను. ఎంత అది ఎంత యిది పడ్డానో ఆ ఆపద్బాంధవునికే ఎరుక.

ఆనంద్:_అది సరే! అసలు ఏం జరిగిందిరా!

కామేశం:-నేను యిక్కడనుండి వెళ్ళి యిద్దరు హోటల్ బాయిస్‌ని కలుసుకున్నాను. మీకు చెరియొక రూపాయి యిస్తాను, చిన్న నాటకమాడాలి అన్నాను. అందుకు వాళ్ళంగీకరించారు! మీరు లాయరు జగన్నాథంగారి యింటిముందుకు వెళ్ళి యీలలువేసి అల్లరిచెయ్యండి! నేను పోట్లాడినట్లు నటిస్తాను. నన్ను మాత్రం నిజంగా తన్నకండి అని బ్రతిమాలుకున్నానురా!

ఆనంద్:-ఊఁ సరే ఏం జరిగిందో త్వరగా చెప్పరా!

కామేశం:_ఏముంది. వాళ్ళ యింటి దగ్గరకు వెళ్ళి యీలలువేసి అల్లరి చెయ్యడం ప్రారంభించారు! ఏదో పనుండి ఆమె బయటికి వచ్చింది. నేను పెద్ద హీరోలాగ వెళ్ళాను. ఏంరా! రాస్కెల్స్ అమ్మాయి ఒంటరిగా వీధిలో నిల్చుంటే అల్లరి చేస్తున్నారు. మీకు బుద్ధివుందా! మీకు చెల్లెళ్ళు లేరా అన్నాను.

ఆనంద్:-నీ గాథ చాలవరకు విషమించిందన్నమాట,

కామేశం:-చాలవరకు పోవడమేమిటి! జయం కూడా కల్గిందిరా!

(సశేషము,

# కన్నతల్లి

శ్రీమతి పఠాంనేని శ్రీశైలభ్రమరాంబ

చిట్టి పొట్టి పాపలంతా
అవ్వదగ్గర కూర్చుండి
కథ ఒకటి చెప్పమని
వేధించి అడుగగాను.
అందులకా అవ్వకూడ
ఆనందముగా కూర్చుని
అందరు చల్లగ కూర్చోండి
చక్కని కథ చెప్పుతాను.
నేను చెప్పబోవు కథ,
కల్లగాదు పిల్లలారా.
నిజంగానే జరిగినట్టి
గాథ చెప్పెద వినండి
కోటి పల్లి చెంతనున్న
చిన్న పల్లెటూరు నందు
ఉన్నదొక్క మాతృమూర్తి,
పుణ్యాంగనయైన ప్రేమ వెల్లి
అయిదు ఏండ్ల ఆడబిడ్డ
మూడు ఏండ్ల మురిపాల కొడుకు
ఆరు నెలల పశివాడొకడు.
ముగ్గురు బిడ్డలతో పతితో -
ఇల్లంతా కలకలలాడే
మనస్సునిండిన ఆనందంతో
పిల్లాపాప భర్తతోనూ
వున్నంతలో ఆనందమొంది
భూలోక స్వర్గమువలె
వున్నదామె కాపురము.
ఇటులుండగ ఒకనాడు
అర్ధరాత్రి వింత జరిగె

వింత కాదు పాపలారా
ఆమె పాలిటి మృత్యువండి
మాతృమూర్తి ప్రేమమూర్తి
చంటి పాపని ప్రక్కనిడుకుని
అర్ధ రాత్రి సమయంలో
హాయిగా నిద్రించుచుండె
ఉయ్యాలలో వున్న కొడుకు
నిద్రలేచి ఏడ్చుచుండ
బాబు ఏడ్పు వినగానే
తల్లి లేచి ఉయ్యాలదరికి వెళ్లే
ఇంటినిండా పొగలుక్రమ్మె
కళ్లు నులిమిచూచుకొనె ఆమె
కిరసనాయిలు లేని కాలమగుటచే
ప్రమిదలోన చమురు పోసి
ఒత్తి ఒకటి వెలిగించి
గూటిలోన దీపముంచె:-
నూనెరుచికి ఎలుక యొకటి
ఎత్తుకొని పోయె వెలుగుచున్న వత్తిని
ఇంటి చూరులోనివరకు
ఈడ్చుకొనిపోయి వదిలె
పూరిల్లు అగుటచేత
ఒత్తినున్న జ్వాలతో
ఇంటిచూరు అంటుకొనియె
చూరుకంటు కున్న జ్వాలా
కప్పువరకు ఎగసిపోయె
మంట చూడ నల్దిక్కుల
ఉవ్వెత్తున ఎగసిపోవుచుండె
అట్టి సమయమందు ఆమె

ధైర్యమంతా కూడదీసుకు
చంటి బిడ్డను ఒక చంకని
ఉయ్యాలలో కొడుకుని రెండో చంకని
ఎత్తుకొని భర్తదరికివచ్చి
జబ్బులో మూల్గుచున్న భర్తతో
అతనితో గూడ ఎట్టెట్టో
అగ్నిజ్వాల బారినుంచి
బ్రతికి బయట కొచ్చిరి.
ఊరునిద్ర పోవు వేళ
ఎవరు రాక పోయినా
భర్త బిడ్డలు బ్రతికిరని
ఆనందించె ఆ తల్లి.
అంతలోన అయిదేళ్ల
ఆడపిల్లగుర్తుకొచ్చి
తల్లడిల్లి పోయె తల్లి
"కూతురు కూతురు" అంటూ
రోదించుచు ఆ తల్లి
మిన్ను నంటు మంటలైన
లెక్కచెయ్యక ఇంటిలోకి
జొరబడియె నా మాతృమూర్తి
తన సంగతి ఏమైనా
బిడ్డ బ్రతికియుంటేచాలు
అనుకొనియె నా తల్లి మనసు
ప్రేమకట్ట తెంచుకొనుచు
మంట లెల్ల చీల్చుకొనుచు
బిడ్డదరికి జేరుకొంది.
కూతురుని గుండెల కత్తుకు
బయట పడగ విసరివేసి
తండ్రి వచ్చి కూతురుని
పట్టుకొనుట కన్నతల్లి కళ్లజూచి
తన చుట్టూ కమ్ముకొన్న
అగ్నిజ్వాల కాగలేక
నేలకొరిగె నా మాతృమూర్తి.
బిడ్డ కొరకు కన్నతల్లి
ఆహూతయ్యె ఆశ్చర్యం
కథ కాదిది పాపల్లారా
కన్నతల్లి కడుపు తీపి —

(120 వ-పేజీ తరువాయి)

పోవటంతో అధికారి కోపం అంచులు దాటింది. తన క్రిందివాడు తన మాటనే తృణీకరించి, ఎదిరించడమా!... గర్జించాడు! బలవంతంగా తనే 'సియా' టోపీని తీసివెయ్యడానికి చెయ్యిచాపాడు... కాని అతనికేం తెలుసు!... ఒకప్పుడు ఆ జాతీయచిహ్నాన్ని 'శాంతి'కి గుర్తుగా ధరించిన సైనికులే సియా జీవిత ఆశామందిరాల్ని పునాదులతో సహా పెకలించి వేసారనీ, అప్పటినుండి, వారు ధరించే ఆ 'యూనిఫారమ్' సియాకెంత అసహ్యమో!...

అధికారి అలా ఆవేశపడటంతో మరింత రెచ్చిపోయ్యాడు సియా! అధికార్ని దూరంగా నెట్టేస్తూ, వెనక్కి రెండడుగులు వేసి, రొమ్ము విరచి ఠీవిగా నిలబడి, పిడికిలి బిగించాడు. అతని ముఖం రౌద్రంతో, వీరత్వంతో మెరిసిపోతూంది! "...నా బొందిలో ప్రాణముండగ ఎవ్వరూ నా 'ఎర్రముక్క' టోపీని తొలగించలేరు!" అంటూ గంభీరంగా అరచాడు. ఆ సమయంలో అతనెంతమందితో నయినా పోరాడ్డానికి, చంపడానికి సిద్ధమైనట్లుగా కన్పించాడు! ప్రతిఒక్కరూ విభ్రాంతులై, 'చేష్టలు దక్కి' మాన్పడిపోయారు. అధికారి గూడ నిశ్చేష్టుడై, గుడ్లప్పగించాడు!

ఈ గంద్రగోళంతో అక్కడో పెద్దగుంపు గుమిగూడింది. ఈ విషయం తెలిసి, విప్లవనాయకులు, సైన్యాధికారి పరుగెత్తుకొచ్చారు.... నాయకుడు సియాతో చాలసేపు వాదించి, చివరకు తన వాదన ఫలించకపోగా, అతినేర్పుగా 'సియా టోపీ' లాక్కున్నాడు. దాన్ని ఓ గుడ్డలో చుట్టేసి భద్రపరచమని పక్కవాడి కిచ్చాడు. యిది ఎలాగో సహించినా, క్రొత్త యూనిఫారమ్ గానీ, టోపీకాని ససేమిరా ధరించనన్నాడు సియా! చివరకు 'సియా' పంతమే నెగ్గింది!... అధికార్లు అతన్ని ఒప్పించలేక, పాత టోపీని తొలగించినందుకు సంతోషపడి, అల్లరి జరక్కుండాచేసి వెళ్ళిపోయారు.

—ఆ తర్వాత పదేళ్లు కాలగర్భంలో దొర్లిపోయాయి. యీ పదేళ్ళూ వంటవాడిగ్గా మాంచి 'సర్వీస్' గడించి, అందరి మన్ననలనుపొంది, ప్రమోషన్ కూ, పెద్ద పదవికీ తగినంత యోగ్యతలను సంపాదించుకున్నాడు సియా!

ఒక శుభ సమయాన, "దేశంలో తమ ఏలుబడిలోనున్న ఫలానా ప్రాంతానికి పరిపాలకునిగా నియమించాం... వెళ్ళాల్సిందంటూ "వుత్తర్వులు అందాయి సియాకు పై అధికార్లనుండి.

కాని, 'సియా' అందుకు నిరాకరించాడు.... తిరుగు జవాబుగా... "నా కిక్కడ యీ వుద్యోగమే బాగ నచ్చింది... నేను మీ ఆజ్ఞను శిరసావహించనందుకు క్షమించాలి! యీ వుద్యోగం వదలి వేరేచోటికి పోజాలను. మరెవర్నయినా ధీశాలిని, బుద్ధిశాలిని చూచి నియమించండి..." అంటూ మృదువుగానే సదుత్తరమిచ్చి, తప్పుకున్నాడు.

◆ ◆ ◆

ఇది జరిగిన కొద్ది దినాలకు నేను వేరే స్థలానికి బదిలీ చెయ్యబడటంతో సియాను వదిలి వెళ్ళవలసి వచ్చింది. ఆ సమయంలో అతను చూపిన ప్రేమాదరణలు, నేనెన్నటికీ మరువజాలను!... యిక తిరిగీ సియాను కలుసుకునే అదృష్టం వుందో లేదో అని విచారించేవాడిని... కాని, తిరిగి 1941 సంllలో 'సియా'ను కలిసే అదృష్టం నాకు లభించడంతో ఎగిరి గంతేసాను? కాదా, గౌరవప్రపత్తులు యినుమడించి, 'కమీసార్'గా తిరిగీ వీరితో కలిసాను.

అదేకాలంలో 'మా పరిపాలనా భాగపు ఎల్లలు విస్తరించడంతో'... సంఘసేవకుగాను యోగ్యులైన పెద్దలు చాలమంది కావల్సివచ్చింది ప్రభుత్వానికి! వారి దృష్టిలో — పనివంతుడూ, యోగార్హతలు గల పెద్దమనిషీ అయిన సియా'లాంటి దేశభక్తులూ, సంఘసేవాపరాయణులూ కన్పించారు. అలాంటి వారందరినీ 'లోకల్ ఆర్గనైజర్'లుగా నియమిస్తూ, ఫలానా ఫలానా ప్రాంతాలకి వెళ్ళవలసిందంటూ 'ఆర్డర్స్' జారీచేశారు!

అలాంటిదే 'సియా'కు కూడా అందాయి! ఈ విషయంలో మాత్రం సియా సంపూర్తిగా తన అంగీకారం తెల్పాడు. ఆ దినం అతడు వెళ్ళవల్సిన దినం! అందరితో బాటూ, 'సియా'కు హృదయపూర్వకమైన వీడ్కోలు యివ్వడానికి పోయాను.

సియా అప్పటికీ యిప్పటికీ అంతగా మారకపోయినా, ముఖంలో మాత్రం కొద్దిగా పొడసూపుతోంది. ముఖంలోనూ, నొసటిపైనా మరింతగా ముడుతలు ఏర్పడి, కళ్ళు మరింతగ కుంచించుపోయాయేగాని, అతని శరీరపాటవం ఏమాత్రం తగ్గలేదు!

దగ్గరకు వెళ్ళాను... "సాయ్!" అంటూ

బొంగురు కంఠంతో పిలిచి, గట్టిగా హత్తుకున్నాడు తన హృదయానికి!...అతని కళ్లు అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి.

“నేస్తం! ఏదీ కడసారిగా నీ ప్రియహస్తాలతో, కాస్తంత ఆ మధుర వంటకాన్ని నాకు రుచి చూపించవ్! యిక నీవెళ్ళిపోతే మరి అలాంటి అవకాశం నాకు లభించదేమో!...” చిన్నపిల్లాడిలా అడిగాను.

“నాకు తెలుసు!...‘కమీసార్’ యిక్కడకు రాగానే అలా అడుగుతాడని...!” అంటూ చిరునవ్వు చిందిస్తూ...‘క్యవోషా’ను ఓ పళ్లెంలో వుంచుకుని, మాంసపు పులుసుతో నింపి, తెచ్చి ఆప్యాయంగా నా ముందుంచి...

“తినవయ్యా, బాబూ! నీ యిష్టమొచ్చినంత తిను. యిదిగో అబ్బాయ్! నన్ను మాత్రం మరువవ్ కదూ...ఎన్నటికైనా ఈ వంటకాన్ని రుచి చూసేప్పుడు ఈ ముసలివాడ్ని గుర్తు చేసుకుంటూండు బాబ్యూ! చాలు...” ప్రేమపిచ్ఛిలంగా, బొంగురుపోయిన కంఠంతో పల్కాడు ‘సియా!’

నేను తిండి తినేంతవరకూ నా దగ్గరే అంటిపెట్టుకుని, ఏవేవో పల్కుతూ హృదయావేదన ననుభవిస్తూ కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు. నాకూ అంతపనే జరిగింది.. చివరకు మనోనిబ్బరంతో లేచివెళ్ళి తన సామాన్లు సర్దుకో నారంభించాడు సియా!...

—అందరం అతన్ని చాలవరకూ సాగనంపాం. చివరకు వీడ్కోలిచ్చాం...చివర్లో సియా చేతుల్ని తన పిడికిట బట్టి...

“వెళ్ళొస్తాను, కమీసార్!...జపాన్‌తో తిరిగీ యుద్ధం సంభవిస్తే, అప్పుడే మన కలయిక మళ్లీ!... అలాంటి అవకాశాలు కల్గాలనీ, మన సమాగమం మళ్ళీ ఏర్పడాలనీ కోరుతున్నా...యిక నిలు సాయ్! వెళ్ళొస్తా...వీడ్ని మరచిపోకురా నాయినా!”...

ప్రియతముల నందరినీ వీడిపోతున్నాననే బాధ, దుఃఖం పెల్లుబికి వస్తున్నా, కృత్రిమపు చిరునవ్వును ముఖం నిండా పులుముకుని, చేయెత్తి అన్నివైపులా ఆడిస్తూ మెల్లగా కదిలిపోయాడు సియా!

దూరంగా వెళుతోన్న సియా తలపైనున్న టోపీ నాకు పూర్వపు దినాలను గుర్తుచేసినై!... అప్పట్లో మా వెనుకలగా ‘రియర్ గార్డు’లా వీపున తన వంటసామగ్రితో నడిచే సియా రూపం కంటిముందు ప్రత్యక్షమై నన్ను కలవరపరచింది...అతని రూపం క్షణక్షణానికి దూరమై, అస్పష్టమైపోతున్నా, అతని తలపైవున్న టోపీకి మిలమిల మెరిసే “ఎర్రచుక్క” మాత్రం సూర్యుని వెలుగులో తళుక్కుమని మెరుస్తూ, మా కండ్లకి జిగేల్ మనిపించింది.

సియా వెళ్ళిపోయాడు!...కాని, అతని ‘ఎర్రచుక్క’ నా హృదయంలో శాశ్వతముద్రగా, సియా రూపం తొలగించలేని చిత్రపటంగా నిలిచిపోయాయి! నిజంగా సియా ప్రతి ఒక్కరికీ అన్ని మార్గాలా ఆదర్శపురుషుడు!

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వెంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)



గురునానకు గొప్ప సంస్కర్త. మానవసంఘమున వ్యాపించిన చెడుగులనన్నింటిని నిరసించెను. మాఢ్యాచారములను తిరస్కరించెను. అతడు ప్రశాంతమును, ప్రేమను ప్రజాకోటికి ప్రబోధించెను. అతని ఆశయములన్నియు ఉదారభావభరితములు. సంప్రదాయముగా మానవసమాజమున పాతుకొన్న దురాచారముల నీసడించెను. హృదయ నైర్మల్యమునకు ప్రాముఖ్యమొసగెను. అంతియగాక, న్యాయమార్గగమనము, శ్రేయోదాయక కార్యకాంక్ష, నిశ్చలభగవద్భక్తి — మానవుని యుద్ధమనమునకు మూలములని తెలిపెను! ప్రజాకోటిలోని అవినీతి మార్గములను నిర్మూలమొనర్చి, మతవిశ్వాసముతో దైవారాధనము చేయుట కెల్లరను ప్రోత్సహించెను. భగవంతుని గూర్చి రాగయుక్తముగ కీర్తించుటయుక్తమని అతని అభిప్రాయము ఎక్కడకు వెడలినను తాను పాడుచున్నపుడు త్రితంత్రీవీణానాదమున శ్రావ్యముగా వాయించుట కాతడు మర్దనుని వెంటనిడుకొని యేగెడువాడు, అతడు తన్ను సమీపించిన యేమనుజునితోనైన:— దేవుని అర్చింపుము. మానవసేవ చేయుము, అదియే నీకు స్వర్గకవాటము” అనెడువాడు. గురునానకునకు స్త్రీలయెడ అమిత గౌరవము, దైవభజన కూటములకు, దైవతత్త్వ ప్రబోధక సభలకు హాజరయి జన్మసాఫల్య మందవలెనని వారికి నిరంతర ముపదేశించువాడు. భగవంతునిగూర్చి పాడుటకు ఉత్సాహము కలిగించువాడు. మతసంబంధములయిన యుత్సవములలో పురుషులతో పాటు వారును పాల్గొనవలెనని ప్రబోధించెడివాడు.

గురునానకు విస్పష్టముగ నిట్లువచించెను:.“భగవత్సాన్నిధ్యము చేరుమార్గము (రహదారి) చాల దూరమయినదియు కష్టతరమయినదియు ధనవంతులకది సులభసాధ్యము కాదు. ప్రతిమనుజుడును అవలంబించదగిన క్రమపద్ధతి యొక్కటియే. దేవుని యిచ్ఛానుసారము గొణుగక సణగక మానవుడు తన జీవితమును గడుపవలెను. అవిశ్వేశ్వరుని కనుగొను మార్గమేది? — అందుల కొక్కటే మార్గము. అతని యిష్టమే నీయిష్టముగ నుండవలెను. ఆయనయనంతత్వముతో నీవును సమైక్యము కావలెను. మార్గాంతరము లేదు”— భగవంతుని యిచ్ఛానుసారము ప్రవర్తించుచు, ఆయన అనుగ్రహముకొఱకు ప్రార్థింపవలెను. అందులకు గురుప్రసాదలబ్ధి మొదటి సోపానము. భగవత్ప్రార్థనకు గురునానకు ప్రాధాన్యమొసంగెను. భగవత్కృప లేనిచో మనమెద్దియు పొందజాలమని అతని విశ్వాసము.

అతడింకను ఇట్లు ప్రబోధించెను:-నిష్కళంకముగు భక్తిపూర్వక వినమ్రస్వభావముతో పరమేశ్వరునుపాసింపుము. ఆయన యనుగ్రహమునకు నిన్ను నీవు సంపూర్ణముగ అర్పించుకొనుము. దురహంకారము, దాంభికప్రవర్తనము, ఆత్మాభిమానము వదలిపెట్టుము. ఆయనకృపను అభిమానమును చూఱగొనుము, నీ ఘనకార్యములను శక్తిసామర్థ్యములను విద్యావివేకములనుగూర్చి అతిశయపడకుము. భగవంతుని అనుగ్రహమును, ఆయనయం లీనమగుటనుగూర్చి సదా కోరుచుండుము. మరణమునకు ఎల్లవేళల సంసిద్ధుడవుగ నుండుము. భార్య భర్త నెట్లు ప్రేమించునో, నీవును అట్లే, దేవుని ప్రేమించుము, వెనుదీయక ఆయనకు పూర్తిగ — జీవితమును అంకితమొనర్చుము. అప్పుడే నీవు భగవత్ప్రీతికి అర్హుడవగుదువు.

నానకు పాడిన నిగూఢ భావ పూరితములగు పాటలు “జపాజీ”-అనబడును. ప్రతిసిక్కు మతస్థుండును ప్రాతఃకాలమున వానిని గానమొనర్చును. “సోహిలా” అను మతియొక విధమయిన కీర్తనలు సాయంకాలమునఁ బాడదగినవియు గలవు.

‘జాపాజీ’ — అను కీర్తనలలో మానవుడాయా దశలలో ఏయే రీతుల మెలగి భగవత్సాయుజ్యము నొందవలెనో, దానినిగూర్చి సంగ్రహముగ నానకు స్పష్టపఱచెను. అట్టి కీర్తనలయిదు ఖండములుగ విభజింపబడెను. అందు మొదటిది ధర్మఖండము. అందు మానవునికర్తవ్యము వివరింపబడినది. ప్రతి వ్యక్తియు తన విధ్యుక్తధర్మములను సక్రమముగ నెఱవేర్చుచు, నైతికమార్గమున నెట్లు ప్రవర్తింపదగునో దానింగూర్చి తప్పక తెలిసికొనవలెను. మనజుడు తన చేతలనుబట్టియే తీర్మానింపబడును.

రెండవది జ్ఞానఖండము; భగవత్తత్త్వమునుగూర్చి విస్పష్టము కావించును. అట్టి జ్ఞాన మపేక్షించువాడు మనః పూర్వకముగను, శ్రద్ధతోను ఏతన్మార్గము నవలంబించును. తన కర్తవ్యమును నిష్కళంకముగ నెఱవేర్చును, తన జీవితగమ్యమగు ముక్తి నొందును.

మూడవది 'స్వరణఖండము ; నిశ్చల తత్త్వజిజ్ఞాసతో ఒడలు మఱచుస్థితిని గూర్చి తెలుపునది. ఇది ఆధ్యాత్మికముగ పరబ్రహ్మానందము కలిగించును. ఇది మనోహరణ దీక్షాదక్షమయినది. అట్టియెడ ఒకవ్యక్తి యొక్క సహజస్వభావమున ధర్మముగూడ ఒకటి యగును. అది అంతకంతకు జీవితమున పాదుకపడి స్థిరముగ మనస్సున నాటుకొనును. అప్పుడది ధర్మనిర్వహణ, జ్ఞానసంపాదనసిద్ధుల కతీతమై యొప్పారును.

నాలుగవది 'కరమ్' (కర్మ) ఖండము. ఇది సర్వశక్తి సంపూర్ణతను తెలియజేయునది. సర్వశక్తి సంపన్నుడగు భగవంతుడే దీని కధిదైవము. అట్టిశక్తి నాశించువారి కది భగవంతు డనుగ్రహించును. వాడన్ని కార్యములు నిర్వహించు శక్తిసామర్థ్యములం జూపుటయ గాక, మహాసాహసుడని ప్రసిద్ధి కెక్కును. ఎల్లరకు నజేయుడగును. మరణభీతి అట్టివాని కెప్పుడు నుండదు.

ఐదవది సత్యమహిమాఖండము. రూపవిహీనమైన సత్యతత్త్వ మిందు తెలుపబడినది. భగవంతుడు సత్యస్వరూపుడు; కాన సత్యమును త్రికరణశుద్ధిగా మానవుడు పాటింపవలెను. అతడు భగవత్సన్నిధి నుండువాడగును; తద్రూపమునే పొందును. వీనికి జీవితగమ్యము కరతలామలకము. వాడే తన శాశ్వతస్థానమేదియో కనుగొన్నవాడగును. తన కాత్మమోక్షము నెట్లు ఏరీతి లభించునో ముందుగనే తెలిసికొన్నవాడగును.

గురునానకు మాటిమాటికి బోధించు ఆధ్యాత్మిక తత్త్వరహస్య మిదియే. "అందరితో కలసి మెలసి ఐక్యభావముతో నుండుము; దేవుని ప్రేమింపుము. తోడిమానవునిలోని ఆత్మారాముని ప్రేమింపుము. పద్మములు నీటిని, చాతకములు వర్షమును, భార్య భర్తను ఎట్లు ప్రేమించునో— ఆరీతిని భగవంతుని ప్రేమింపుము. నీ కలమును, నీ భావమును, నీ వ్రాయస కానిని— దైవానురాగముగ గలవానినిగా చేయుము. భగవన్నామ జపము చేయుచున్నంతవరకు నీవు సజీవుడవు. అది మరచుచో నిర్జీవివి. ఆ పరమేశ్వరునికి నీ హృదయమును దాపరికములేక విప్పిచెప్పుము. ఆయనతోనే నీవు సదా సహవాసమొనర్పుము. ఆయనబాహుద్వంద్వమున జిక్కియున్నట్లు భావించి, ఆ భగవదాలింగమున చొక్కియుండుము."

నానకు తన బోధనములను ఒక దివ్యమయిన కీర్తనముతో నీక్రిందివిధమున సంగ్రహించెను :-

ప్రతిమతంబునఁ గల సాధుతతిఁ గొలువుము
మదము, మత్సరమును నెద మానిమనము
మతములందలి సారము మదిని గొనుము
నమ్రభావము కరుణ నెన్నడు విడకుము॥

జిలుగు చీనాంబరంబుల వలనఁగాని,
పలురకపు కావిగుడ్డల వలనఁగాని,
చెలగు వెనుశంఖనాదాల వలనఁగాని
తెలి విబూదుల భజనల వలనఁగాని

చెలఁగు ముండిత శిరముల వలనఁగాని
ఖలంతపస్సుల జపముల వలనఁగాని
సులభమగు యతివేషాల వలనఁగాని
అమర దపవర్గసౌఖ్యము, లహరహంబు

విమలభావము, మంచితనము, పరోప
కారచింతయు జగమునఁ గల్గనఖిల
వైభవముల విరాగ మెవ్వనికిఁ గలుగు
వాడె భగవత్ప్రియుండు సద్భక్తియుతుఁడు.

గురునానకు మతానుయాయులకు "వాహేగురు" అనునది గురుమంత్రము. "ఏకోంకార్ సత్నాం కర్తా పర్ ఖ్ నిర్భవ నిర్వైర్, అకల్మూరత్ అజూనీ సవై భాంగ్ గుర్ పర్సాద్" అహరహము ఉచ్చరింప వలసిన మహామంత్ర మిది. (దీని భావము) :-"దేవు డొక్కడే. ఆయన నామము సత్యము. ఆయనయే సృష్టికర్త. అన్నిటను ఆయనయే వ్యాపించి యున్నాడు. ఆయనకు భయము, దిగులు— అనునవి లేవు. ఆయనకు శత్రువులు లేరు. ఆయన శాశ్వతముగ నుండువాడు. ఆయన తనకు తానే జన్మించినవాడు; తనకు తానే జీవించువాడు. ఆయన అజ్ఞానాంధకారమును పోగొట్టువాడు. ఆయన కరుణాస్వభావుడు." సృష్టికాదిమూల మాయనయే. అంతేకాదు; సృష్టికి ముందుకూడ ఆయన గలడు. ఆయన అట్లే ఇకమీద కూడ ఉండగలడు. అంతెందులకు ప్రపంచమునకు ప్రళయము సంభవించి నశించినను, ఆయన ఉనికి మాత్రము శాశ్వతమయినదే.

## గ్రంథసాహెబ్

సంస్కృతలిపిని సంస్కరించి గురునానకు గురుముఖి యను నూతనలిపిని సృజించెను. సిక్కుల పవిత్ర గ్రంథము ఆ లిపిలోనే వ్రాయబడినది. సిక్కులు, సింధుదేశస్థులు దానిని పూజింతురు. ప్రతి గురుద్వారమునను ఒక గ్రంథసాహెబు గలదు. ఆ పవిత్ర గ్రంథమును 'ఆదిగ్రంథ'- మనియు సిక్కులు వచింతురు. అందు మొదటి యైదుగురు సిక్కుగురువుల గీతములు గలవు. ఆ గీతములను అన్నింటిని ఒకటిగా చేర్చి పుస్తకరూపమున ఒకే సంపుటముగ సిద్ధపరచి, ఆ మతి పంచమగురువు "గురుగ్రంథసాహెబ్" అని పేర్కొనెను. అందు ఆకాలములో నుండిన కబీరు, కొందఱు వైష్ణవభక్తులు- మున్నగువారు రచించిన కీర్తనములుగూడ గలవు. తరువాత తొమ్మిదవ గురువు పాడినపదములను వానితోగూడ పదియవ గురువు చేర్చెను. గ్రంథసాహెబున గల గేయములలో గురునానకు ప్రణీతములే అసంఖ్యాకములు.

గ్రంథసాహెబు క్రిందిగీతముతో ప్రారంభించును:-

"ఎవనినామము సత్యమయినదో, అట్టి ప్రభువు ఒక్కడే. ఆయనయే సృష్టికర్త."- ఈ బృహద్గ్రంథమందు పెక్కునీతులు వివరింపబడియున్నవి. మానవుడు నిష్కళంక జీవనుడై యుండవలెను. గురువునెడ వినయవిధేయతలు గలిగియుండవలెను. దయ, దానము, శాంతము, న్యాయము, ఋజువర్తనము, సత్యము, ఆత్మత్యాగము, సేవాభావము, ప్రేమస్వభావము, మాంసాహారవిసర్జనము- వీటినిగూర్చి గ్రంథసాహెబు ముఖ్యముగ దెలుపుచున్నది. ఆవిధముగనే లోభము, క్రోధము, గర్వము, విరోధము, దురభిమానము, ఆత్యాశ, స్వార్థపరత్వము, క్రౌర్యము, కొండెము లాడుట, అసత్యము- మున్నగువానిని తీవ్రముగ నిరసించుచున్నది.

## గురునానకు నిర్యాణం

అవసానదశయందు నానకు కర్తారుపురమున నివాస మేర్పఱచుకొనెను. మొదటిసారిగా అతడట కుటుంబముతోగూడ వసించెను. తనవారుండుటకిండ్లును,- ఒక ధర్మశాలయును నిర్మింపబడెను. మర్దనుడును అతనితోగూడ అచ్చటనే నిలిచెను. ప్రతిదినము ఉభయసంధ్యలయందు నానకు సమక్షమున ప్రార్థనలు, సంకీర్తనములు నడుచుచుండెను. ఆ కీర్తనములు నానకుగురునిచే విరచితములైనవే. అతడు క్రీ. శ. 1538 సం॥న తన యరువదితొమ్మిదవయేట దేహము చాలించెను. అతని తరువాత 'అంగదుడు'- అనునతడు సిక్కులకు మతగురువయ్యెను.

(104వ-పేజీ తరువాయి)

సంభూత మాత్మ న్యేవాత్మానం బిభర్తి. తద్యదా స్త్రియాం సిఞ్చత్యథైనజ్జనయతి తదస్య ప్రథమం జన్మ.॥ (1)

[(గర్భిణీస్త్రీలు నిష్క్రమింతురుగాక.) మనుష్యునియందు మొదలు బీజరూపమున ఇతడు (జీవుడు) ఉండును. అతని సమష్టి అంగములందుండు బలము, వీర్యము, సారరూపమున రేతసగుచున్నది. ఆత్మయందు ఆత్మను ధరించుచున్నాడు. ఈ రేతసును స్త్రీ గర్భమున వదలునపుడు దానికి జన్మము కలిగించుచున్నాడు. ఇది దానికి మొదటి జన్మము.]

తండ్రి క్రమక్రమముగ కుమారుడుగ పరివర్తనము పొందు విధానము ఈ భాగమున విస్తారముగ వివరింపబడుచున్నది. బ్రహ్మాండమంతయు ఏకస్వరూపమని తెలుపుటతో వేదాంతము తృప్తిపొందుటలేదు. అట్టి సిద్ధాంతమును, స్థిరపరచుటకు చక్కని తర్కవాదము, అనుభవప్రశంసలు తెలిపి, ఒకటికి, మరొకటికి గల సన్నిహిత సంబంధమును తెలుపుచున్నది.

ఈ అధ్యాయమున, ప్రజోత్పత్తిక్రమము వివరింపబడుచున్నది. వేదాంతమున, లింగభేదవ్యామోహ వ్యవహారములు శృంగారరసమును కోలుపోవుచున్నవి. జంతు విమర్శశాస్త్రమునందు, ఒక బీజము, ఒక గర్భమునను చేరుటవలన, పిండముగ మారి, శిశురూపమున భూపతనము పొందుచున్నదని తెలియుచున్నది. ఆ దేవిషయమును వేదాంత సూత్రముల సహాయమున, పవిత్రభావముతో, సూక్ష్మముగ ఇచట విచారించబడుచున్నది. అనేక నిదర్శనములవలన, తండ్రికిని, తనయునికిని గల అద్వితీయ సమత్వమును ఋజువు చేయబడుచున్నది. ఈ విషయము చక్కగ బోధపడినచో, సమాజమున కొలత మానవుని కుటుంబముయొక్క నిర్మాణము బోధపడును. కుటుంబ నిర్మాణము సంస్కారము పొందినచో, కులము, సంఘము, జాతియును, ప్రపంచము కూడ సంస్కారము పొందును. అందువలన అన్యోన్యసమత్వము కుదురును. పరస్పర సోదరప్రేమ, భ్రాతృత్వము స్థిరముగ ఏర్పడును.

ఈ భాగమారంభమగుటలో, నొక నాటక విజ్ఞాపన కలదు. సభయందు సమావేశమైయుండు గర్భిణి స్త్రీలు, కొంత కాలము నిష్క్రమించవలెనని తెలుపబడుచున్నది. ఈ భాగము ముగియునపుడు వారలు సభయందాసీనులు కావచ్చునని తెలుపుచున్నారు. వేదాంత విచారమునకు స్త్రీలకు యోగ్యతలేదను వాదము నమ్మదగియుండినచో, ఇట్టి వాక్యములు, గురువు పలుకుట కవకాశముండదు. ఈ మంత్రము వేదమున యున్నది. నేడు కల్పింపబడినది కాదు. కనుక, ఆ కాలమునందు, హిందూ మహిళా జనము తరచుగా మహాత్ముల సందర్శించుచుండిరనియు, వేదాంత విచారమున స్వేచ్ఛగ సమావేశమగుచుండిరనియు నిర్ధారణయగుచున్నది.

కాలము గడచుకొలది, హిందూమతము క్షీణదశ పొంద నారంభమగుటతో, అభిమాన పురుషులగు పురోహితవర్గము వారు, తేజోవంతము, నిర్మల ప్రకాశవంతముగ నుండిన మతధర్మములకు ప్రయత్నపూర్వకముగ, ఉపద్రవములు కలిగించియున్నారు. తమ మతమును తిరస్కరించునంతటి పరిస్థితులు ఆ విద్వాంసుల కేల కలిగెనో, వారి భావములు నేటి విచారపరులకు ప్రకటితమగుటలేదు. అట్టి అగ్రసంతతివారు, తమ మతధర్మమునగల రాజబాట లోనగు వృక్షచ్ఛాయలందు సుఖము గాంచలేక, అడ్డుతోవలు త్రొక్కి, తమకు, తమ వంశము వారికి, గొప్ప నష్టము కలిగించి, నేటి పరితాపమునకు కారకులైరి.

ఈ నాటక విజ్ఞాపనవలన, ఆ ఋషియొక్క ఆశ్రమ వాతావరణమంతయు చిత్రించినట్లు ఊహింపనగుచున్నది. ఆశ్రమమునందు ఋషి, తాను చేరదీసిన శిష్యులకు వేదాంత రహస్యములను బోధించి, జ్ఞానభిక్ష పెట్టుచుండెను. అట్టి విచారసభయందు, శ్రద్ధగలవారు, మతవిషయముల తెలియగోరువారు, ఆసీనులగుటకు అవకాశముండెను. ఆలకించగోరినవారెల్ల, అల్లరి చేయక ఆలకించవచ్చునని ప్రోత్సహింపబడుచుండిరి. ప్రస్తుతకాలమున హిమాలయ ప్రాంత్యములందు జరుగుచుండు ఏర్పాటులు, ఆనాటి యలవాటులను జ్ఞాపకపరచుచున్నవి. మా గురువు (పూజ్యపాద, శ్రీ స్వామీ తపోవన్జీ మహరాజు) ఉపనిషత్ప్రవచనము చేయునపుడు, వారి యాజ్ఞలేక, పుస్తకముల చేతబూని సమావేశమున కూర్చుండుటకు ఎవరికిని స్వతంత్రము లేకుండెను. అయినను, అనేక మహాత్ములు, గృహస్తులు కూడ, తపోవన కుటీరప్రాంతమందు సమావేశులై, క్రమము తప్పక గురుదేవుని ప్రవచనముల శ్రవణించుచుండిరి. కాని, వారిలో యెవరును గ్రంథము చేతబూని పాఠము చేయ అనుమతి పొందియుండలేదు. పాఠము నేర్చ తలచినవారు, గురుదేవుని అనుమతితో శిష్యవర్గమున చేరవలసియుండెను. (సశేషము)

# సంపాదకీయములు

## అస్పృశ్యతా నివారణ - శిక్షలు

ఆంధ్రదేశంలో గతసంవత్సరం అస్పృశ్యతా నివారణచట్టం క్రింద ఒక దేవాలయ ధర్మకర్తలకు రు. 100 లు జుల్మానా విధించారని ఆంధ్రప్రదేశ్ సంక్షేమశాఖ మంత్రి శ్రీమతి మసుమా బేగం రాష్ట్ర శాసనసభలో ఒక ప్రశ్నకు జవాబు చెప్పారు.

అస్పృశ్యత అనేది విద్యావిజ్ఞానాల వ్యాప్తితోటి, నిమ్నజాతీయులు మెరుగైన జీవయాత్ర కలవడటంతో శరవేగంగా నామరూపాలు లేకుండా పోతున్నది. ఇక కాస్తోకూస్తో దేవాలయాలలోనే యింకా పాటింపులో నున్నది. అదైనా వేషభాషలనుబట్టి పాటింపుగా నొప్పచున్నదేకాని సాధారణంగా శుచి, శుభ్రంగానుండి నలుగురితోబాటు వేషభాషల కలవాటుపడినవారికి దేవాలయ ప్రవేశానికి అంటంకాలంటూ లేవు.

ఈ సందర్భమున హరిజనులల్లాంటి నిమ్నజాతీయులు మేలైన జీవితసరళి కలవాటుపడితే తాము అస్పృశ్యులమనే భావమే అవసరముండదు. పైగా అస్పృశ్యతా నివారణకని వెచ్చించబడే పెద్దమొత్తాలు సయితం జాతీయాదాయానికి మిగిలిపోగలవు.

## స్త్రీలకు ఉద్యోగ విద్యావకాశములు

బెంగాల్ శాసనసభ ఎదుట స్త్రీలకు యితోధికంగా ఉద్యోగాలు చూపించాలనీ, తగినంత విద్యావకాశాలు కల్పించాలని అభ్యర్థిస్తూ 500 మంది స్త్రీలు వూరేగింపుతో బయలుదేరి వెళ్ళి ప్రదర్శనలు జరిపిన సందర్భమున స్త్రీలలో పెంపొందుతున్న చైతన్యానికి అభినందిస్తున్నాము. కాని యిట్టి ఆందోళనలు ఏ రాజకీయ పార్టీయైనా ప్రయోజనం కొరకని ఉద్దేశించి స్త్రీలను వినియోగించుకుంటే మాత్రం హర్షించ తగినది కాదు.

స్త్రీలకు మామ్మాటికి విద్యావసతులు విస్తృతం కావాలి. వారి శక్తిసామర్థ్యాలు, సహజస్వభావముల ననుసరించి, విద్యాయోగ్యతల ననుసరించి ఉద్యోగావకాశములు అమరవలసియున్నవి. కాని చదువుకున్న స్త్రీలందరికి పురుషులతో సమానంగా ఉద్యోగాలు కావాలంటే నిరుద్యోగ సమస్య మరింత వికృతం కాగలదని మరువకూడదు. ఉన్న ఉద్యోగావకాశాలను వాస్తవిక పరిస్థితుల కనుగుణ్యంగా తమ జీవనోపాధిని నిర్ణయం చేసికోవడం చదువుకున్న మహిళ చేయవలసిన పని - విజ్ఞత అనిపించుకునేది. అంతేకాని ప్రభుత్వోద్యోగాలకని వాస్తవపరిస్థితులను విస్మరిస్తూ ఆందోళనచేసినా, ప్రదర్శనలు జరిపినా ఫలితం శూన్యమగుటయే కాక సంఘజీవనం నిరుద్యోగ సమస్యతో దుర్భరము కాగలదు.

## ఆంధ్రప్రదేశ్ లో రెండు పాలిటెక్నిక్ లు

అఖిలభారత సాంకేతిక విద్యాసంఘపు ప్రాంతీయసంఘం కాకినాడ, హైదరాబాద్ నగరాలలో స్త్రీలకొరకు రెండు పాలీటెక్నిక్ లను స్థాపించడానికి తీర్మానించి ఒక్కొక్కదానికి 11 లక్షల రూపాయలను కేటాయించారు. వీటిల్లో సివిల్ ఇంజనీరింగ్, డ్రాఫ్ట్స్మన్ షిప్, రేడియో ఇంజనీరింగ్, సెక్రిటేరియట్ శిక్షణ గరపుతారట. ఇది ఆంధ్రమహిళా లోకానికి మహదావకాశము. ఇది సద్వినియోగం కాగలదనే ఆశిస్తున్నాము.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punnaiah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.






LODHRA PRESS, MADRAS-14.